ఓ౩మ్.

# ఆర్యసమాజము ?

ప్రకటనకర్తలు:

సార్వదేశిక ఆర్యప్రతినిధిసభ, ఢిల్లీ.



గ్రంథకర్తలు:

పండిత: గోపదేవ్, దార్శనికః.

పండిత మదనమోహన విద్యార్థి,

౧౯౩౯

[వెల రు ౦—౬—౦

శ్రీ కన్యకా ముద్రాక్షరశాల,
బెజవాడ.

"………పవిత్ర భారతావనియందు జన్మించి, ఈ దేశోద్భవములైన అన్న జలాదులచే మనము పెరిగి పెద్దవారలమైతిమి. అట్టిచో మనము ఆర్యమార్గములను విడిచి, విదేశీయ మతములపై నభిమాన ముంచుట విదేశీయ భాషాభ్యసనముజేసి పండితోత్తములమని విఱ్ఱవీగుట—ఇది యంతయు సద్బుద్ధి లక్షణమా?……"

—దయానందమహర్షి

ఓమ్.

# భూమిక.

నవీనభారతమున కాధారశిల యగు నార్యసమాజమును దక్షిణ భారతము చాలవరకు నెరుంగదనియే చెప్పవచ్చును. తెలిసినంతవరకు నార్యసమాజ విషయమున జనులలో ననేక విధములగు భ్రాంతవిచారములు వ్యాపించియున్నవి. కొందరు దీనిని బ్రాహ్మసమాజ మనియు మరికొందరు రాధాస్వామి మత మనియు నెంచుచున్నారు. అనేకులు దీనిని 'రామకృష్ణ మిషన్' వంటి మిషన్ అనియు తలచుచున్నారు. ఆర్యసమాజ మొక క్రొత్తధర్మమని యెంచువారును వీరిలో లేకపోలేదు. సనాతనుల మని యనుకొనువారిది నాస్తికసంప్రదాయ మని విశ్వసించుచున్నారు. వీరిలో చాలమంది యార్యజాతిని విరోధించు సంఘముగా నెంచి యార్యసమాజముయొక్క స్వరూపము నెరుంగక వర్తించువారును గలరు. మా మిత్రులలో నొకరు "మాకు ఆర్యసమాజికులలోను తురుష్కులలో భేదము కానరాదు. కారణ మేమన సామాజికులు మందిరములను విరోధింతురు, తురుష్కులు మందిరములను భగ్న మొనర్తురు" అనెను.

ఇట్టి భ్రామకవిచారములను దూరమొనర్చుట మాకు కర్తవ్యము. అందువలన నీపుస్తకము ద్వారా ఆర్యసమాజము

యొక్క యథార్థరూపమును జనులకు తెలియజేయ కోరు చున్నాము.

"వేదోఽఖిలో ధర్మమూలమ్"

వేదములే ధర్మమునకు మూలకారణము. ఆర్యసమాజ ధర్మము వైదికధర్మము. వేదములందు జెప్పబడిన కర్తవ్య కర్మలే ధర్మము.

"అర్థకామేష్వసక్తానాం ధర్మజ్ఞానం విధీయతే।
ధర్మం జిజ్ఞాసమానానాం ప్రమాణం పరమంశ్రుతిః
పితృదేవ మనుష్యాణాం వేదశ్చక్షుః సనాతనమ్"

మను

బ్రహ్మచారులు, గృహస్థులు వానప్రస్థులుగా నెంచ బడు మానవులకు వేదము జ్ఞానసాధనము.

"సర్వేషాంతు సనామాని కర్మాణిచ పృథక్ పృథక్
వేదశబ్దేభ్య ఏవాదౌపృథక్సంస్థాశ్చ నిర్మమే"
"చాతుర్వర్ణ్యం త్రయోలోకాః చత్వార ఆశ్రమాః

పృథక్

భూతం భవ్యం భవిష్యచ్చ సర్వం వేదాత్ప్రసిద్ధ్యతి"
"బిభర్తి సర్వభూతాని వేదశాస్త్రం సనాతనమ్.
"తస్మా దేతత్పరం మన్యే, యజ్జన్తో రస్యసాధనమ్"
"సేనాపత్యంచ రాజ్యంచ దండ నేతృత్వమేవచ"
సర్వలోకాధిపత్యంచ వేదశాస్త్రవి దర్హతి" మనువు

ఈ వైదిక ధర్మమును బాగుగా నెరుంగ గోరువాడు జ్ఞానపూర్వకముగా వేదములను చదువుట ఆవశ్యకము.

సర్వంతు సమవేక్ష్యేదం నిఖిలం జ్ఞానచక్షుషా'

శ్రుతిప్రామాణ్యతో విద్వాన్ స్వధర్మే నివిశేతవై

ధర్మశాస్త్రములు వేదముల ననుసరించుచున్నంతవరకు ధర్మనిరూపకము లగును. ధర్మశాస్త్రములు స్మృతు లనబడును. వేదము శ్రుతి యనబడును.

"శ్రుతిస్తు వేదో విజ్ఞేయో ధర్మశాస్త్రంతు వై స్మృతిః

ఒక ధర్మమును నిర్ణయించు విషయములో శ్రుతి స్మృతులలో విరోధము గలిగినట్లైన శ్రుతియే ప్రమాణ మగును. కాని స్మృతి కానేరదు.

"శ్రుతిస్మృతివిరోధేతు శ్రుతిరేవ గరీయసీ" జాబాలి

భవిష్య పురాణములో నిట్లు వ్రాయబడి యున్నది.

" శ్రుత్యాసహ విరోధేతు బాధ్యతే విషయంవినా"

శతపథము మున్నగు వేదభాష్యములైన బ్రాహ్మణ గ్రంథములను తిలకించినను, అధ్యాత్మమును బోధించు నుపని షత్తుల పారాయణము జేసినను, మానవ ధర్మములను ప్రతిపా దించు స్మృతులను జూచినను, శ్రౌతసూత్రములను పరిశీలించి నను, పురాణాదులను పఠించినను అనాదికాలమునుండి వేదమే సమస్త జ్ఞానమునకు మూలమనియు, విద్యల కాకరమనియు

మనకు బోధపడును. వేదములందే వేదమహిమ యిట్లు వర్ణింప బడియున్నది.

"పశ్య దేవస్య కావ్యం న మమార న జీర్యతి"

దేవకావ్యము—వేదము నశింపదు, జీర్ణింపదు చూడుము. అనగా వేదములలో జెప్పబడిన విషయము లమృతములే కాక జీర్ణభావమును పొందవు-నవ నవములైయుండునని భావము.

బ్రహ్మ మొదలు దయానందమహర్షి వరకు గల ఋషు లెల్లరు నేకగ్రీవముగా నీ మతము నంగీకరించిరి. ఆర్యజాతికి సంబంధించిన విశాల సాహిత్యమునందున్న ప్రతి శాస్త్రమునకు వేదములతో సాక్షాత్సంబంధ మున్నది.

వైదికధర్మ మన నేమి? యజుర్వేదమున గల

"విద్యాంచావిద్యాంచయ స్తద్వేదోభయగ్ం సహ,
అవిద్యయా మృత్యుం తీర్త్వావిద్యయాऽమృతమశ్నుతే"

అను నీ మంత్రమున వైదిక ధర్మముయొక్క- నిజ స్వరూపము చూపబడినది.

"అవిద్యా=భౌతిక విజ్ఞానము. దీని నెఱిగి దానిద్వారా భవసాగరమును తరించునుపాయ మెరుంగవలయును.

విద్యా=ఆధ్యాత్మికజ్ఞానము. దీనిని తెలిసికొని అమృత మును (మోక్షమును) పొంది సుఖించవలయును". ఇది ప్రతి మానవున కుచితము. ఇదియే వైదికధర్మ మనబడును. ఇట్టి ధర్మము నాచరించువారు సర్వాంగసుందరు లగుదురు.

వైశేషికదర్శనములో
"యతోఽభ్యుదయనిశ్శ్రేయససిద్ధిః స ధర్మః"
ఇహపరలోకముల సమృద్ధియు, మోక్షసిద్ధియు దేని వలన కలుగునో అది ధర్మమని చెప్పబడియున్నది. వైదిక ధర్మమును స్వీకరించి దాని కనుకూలముగా నాచరించుటచే నిహపరాభ్యుదయములే గాక మోక్షమును లభింపగలదు.

వేదమున మోక్షప్రాప్తి కీశ్వరజ్ఞానము కారణమని చెప్పబడినది.

"త మేవ విదిత్వాఽతిమృత్యు మేతి
నాఽన్యః పంథా విద్యతేఽయనాయ"
పరమేశ్వరు నెరుంగుటకంటె మరియొకమార్గము మోక్షకాములకు భువిలో లేదని దీని తాత్పర్యము.

వేదవిహిత ధర్మమునందు ఈశ్వర వాదమునకు ముఖ్య స్థాన మొసంగబడినది. ఈశ్వరమూలక ధర్మము భావుకు డగు మనుష్యుని హృదయమున భక్తిరసమును పెంపొందించును. ప్రేమగంగను ప్రవహింపజేయును. సత్యమునందలి శ్రద్ధను ఆత్మవిశ్వాసమును దృఢపరచును. ఈశ్వరవిశ్వాసము గల ధర్మాత్ముని శ్వాసప్రశ్వాసములందు "ఇదం నమమ ఇదం నమమ" అను గానము నిరంతరము వెలువడుచుండును. ఆతని హృదయమున దయాసముద్ర ముప్పొంగును. అతడు కష్టముల నెదుర్కొనియు పరుల నుద్ధరించుటలో తత్పరుడైయుండును. వైదిక

ధర్మమును పాలించువారి హృదయమున నాశాజ్యోతి అంకు
రించును. నిరాశాంధకారము దూరమగును. అతనిలో సాహ
సము ధైర్యము కలుగును. నిర్భయు డగును, జ్ఞానప్రవాహమున
నతని చిత్తమాలిన్యము కడుగబడును. ఇదంతయు నీశ్వరుని
దయవలన కలుగును. ఆపరమాత్ముని అంకమున ఆత్మ నిశ్చింత
సుఖము ననుభవించును.

ఈశ్వరవిశ్వాసము గలవా డార్యు డనబడును. ఆ ఈశ్వరుని
నిశ్వాసముల బోలు వేదములం దుపదేశింపబడిన ధర్మముల
విషయమునను ఉత్తమశిక్షణలందును ధ్యాన ముంచి వేదసందే
శమును దిగంతములందు వ్యాపింపజేయుటకై "కృణ్వన్తో విశ్వ
మార్యమ్" అను భావముతో ప్రాచీనఋషులు సముద్రములను
తరించిరి. ఉత్తుంగహిమాచల శిఖరములను దాటిరి. దేశదేశాంత
రములందు వైదికధర్మధ్వజమును స్థాపించిరి.

రోజులు గడచినవి, వారము లంతరించినవి, మాసములు
వెనుకబడినవి, ఒక్కటొక్కటిగా యేండ్లు గతించినవి, వేలకొలది
శతాబ్దములును జరిగిపోయినవి. కాలచక్రము ప్రపంచమున
విస్తరించియున్న వైదికధర్మమునందు మార్పులు గలిగించినది.
దేశభేదమువల్ల గూడ వైదికధర్మము వికృతరూపమును ధరించి
నది. అనేక మతమతాంతరములు బయలుదేరినవి. వైదికాచా
రములు పూర్తిగా భ్రష్టమైనవి, వానిరూపమే మారిపోయినది.

ఏభారతము వైదికధర్మమునకు జన్మస్థానమో అక్కడే యీ ధర్మము లుప్తప్రాయమైన నితరదేశములస్థితి యెట్లుండెనో చెప్పనేల? భారతదేశమున నెల్లయెడల నవైదికగాథలే వర్ణింపబడసాగెను. కర్మలలోను వైదికత నశించినది. పూజాపాఠములు క్రొత్తవి కల్పింపబడినవి. ఆర్యజాతి యనేక శాఖలలో విభజింపబడినది. ఆర్యుల సామాజిక రీతులలో నెన్నియో భేదము లేర్పడినవి. ప్రస్తుతము దేశమున వివిధగా నాచారములో నున్న ధార్మికపద్ధతులను జూచి పూర్వకాలమున వీని కన్నింటికి మూలము వైదిక ధర్మమని యూహించుట దుస్తరమగును.

ఇట్లు వైదిక ఆశావాదాంబరమున నిరాశ యను మేఘము లలుముకొనిన సమయమున కొండొక ఆశావాయువు వీచినది. ఈ భయంకరస్థితిని మార్చుట కొరక పవిత్రాత్మ దయానందమహర్షి రూపమున కార్యక్షేత్రము నలంకరించినది. దయానందమహర్షి వంటి యద్వితీయ సంస్కర్తను భారతజాతియందు ప్రాదుర్భవింపజేసిన పరమేశ్వరున కనేక ధన్యవాదములు.

మహర్షి పరమేశ్వరుని స్వరూపమును చక్కగా బోధించెను. ఈశ్వరాదేశమును నిశ్చయించి జాతికి దారి చూపెను. పరమాత్మని స్వరూపమును, నతనియాదేశమునను నీ రెంటియందుగల దృఢతమవిశ్వాసమే యార్యసమాజమునకు ఆధారశిల. సమాజజీవనమున కిదియే స్వతంత్రమూలము.

దయానందుడు కార్యక్షేత్రమునకు రాకమునుపు లోక హిత మొనర్చుట, జనులను సంస్కరించుట, దీనుల నుద్ధరించుట, ఆతురుల నాదరించుట మున్నగు సత్కార్యములు భారతమున గల మతములలో ధర్మాంగముగా నెంచబడ నుండెను. వ్యాపారమున నేమి, వ్యవహారమున నేమి, ఇతర సాంసారిక కార్యములందేమి సత్యముతో ధర్మానుసారముగా వర్తించుట ధార్మిక ప్రపంచమున క్రియాత్మకముగా గానరాకుండెను. జాతి బంధనములు ఆర్యులలోగల పారస్పరిక ప్రేమను కూకటివేళ్ళతో నూడబెరికెను. ధర్మాచార్యులు పరోపకారమును, ఐకమత్యమును, శిష్టాచారములను బోధించుట మానిరి. అందువలన నార్యధర్మము సామాజిక రూపమున నేకవిశ్వాసము కలిగియుండకపోగా లోకసేవయందును సార్వజనిక కార్యములందును పాల్గొనుటలో మిక్కిలి వెనుకబడియుండెను.

ఈ స్థితినిగురించి మహర్షి దయానందుడు వైదిక ధర్మమును పునరుద్ధరించి ప్రపంచమున వ్యాపింప జేయుటకై 'ఆర్యసమాజము'ను స్థాపించెను. ఈ సమాజము ధార్మిక సేవాసంఘ మనదగియున్నది. ఇందులో జేరువారు పాటింపదగు నియమములు పది. ఆ నియమములను బోధించి వ్యక్తులను ఆర్యసభాసదులుగా నొనర్చుట లోకహిత ధర్మకార్యములను సులభముగా నెరవేర్చుట కొఱకే. దయానందునిచే నేర్ప

రుపబడిన నియమములలో మొదటి రెండు నియమములు గాక మిగిలిన వన్నియు మనుష్యుడు ఉదారుడు సత్యవ్రతుడు ఋజు ప్రవర్తనుడు వివేకియు నగు నట్లు చేయగలవు. మరియు నవి మనుష్యునిలో ప్రేమను సభ్యతను వృద్ధిపొందించును. లోక హితకార్యముల నిర్వర్తించుటలో దీక్షితు నొనరించును.

సమాజ నియమములు దాని విశ్వాసమును, ఉద్దేశ మును, కర్తవ్యమును చక్కగా విశదీకరించు చున్నవి. ఈ నియమముల ననుసరించు వారి హృదయములో సంశయగ్రంథి విడిపోవును. నియమ రచనలో గల యీ విశేషత మహర్షి గొప్పతనమును వేనోళ్ళ చాటుచున్నది. ప్రతిదిన మీ నియమ ములను పరిశీలించుచు వాని ననుసరించునెడల మనుష్యుడు క్రమికోన్నతిని పొందగలడు. తన మానవజీవమును సఫల మొనర్చుకొనగలడు. వానికి భయముగాని, సంశయముగాని, ధర్మమార్గమున గలుగనేరదు. ఇహాపరములు సిద్ధించును.

ఇవి మనుజుని హృదయమును విశాల మొనర్చును. సంకుచితత్వమును పోనాడును. స్నేహపూర్ణ మొనర్చును. సంతప్తులకు శాంతి నొడగూర్చును. ఇట్లు ప్రపంచ శాంతికి కారణభూతము లగును.

ఇట్టి నియమములను పాలించు ప్రతి ఆర్యుడు న తాను లోకహిత మొనర్చుటకు వ్రతమును గైకొంటినన భావనను మరువరాదు. వైదిక ధర్మప్రచార మొనర్ప బద్

కంకణులైన వారిలో తానొక వీరసైనికుడను దృఢసంకల్పము కలిగియుండవలెను. మహర్షి దయానందు డిట్టివారి చేతులలో ప్రాచీన ఋషులచే నొసంగబడిన వేదజ్ఞాన మను నిక్షేపము నుంచెను. దాని ననుభవింప నధికారులు నిట్టివారే. వీరే వైదిక ధర్మమున గల ఉత్కర్షాప కర్షములకు దాని ప్రచారమున గలుగు హానిలాభములకు నుత్తరదాతలు.

నా యీ వాక్యములు సమాజవిషయమున జనులలో గల భ్రమలను చాలవరకు బోగొట్టగలవని యెంచుచున్నాడ. ఈ చిన్నపుస్తకము ధర్మప్రేములలో నొకని హృదయమున నైనను వైదిక ధర్మజ్యోతిని వెలిగింపగలిగినచో, వేదామృత బిందువు నొకదాని నైన వానిచే పానము చేయింపగలుగుచో, ఒక భారతీయుని హృదయమునందైన వైదికధర్మ ప్రభావము ను స్థాపింపగలుగుచో నా ప్రయత్న మెంతయు సఫలమని యెంచెద.

ఈ మా పుస్తకమునకు శ్రమయని యెంచక తమ యమూల్యాభిప్రాయమును వ్రాసియిచ్చిన ప్రఖ్యాత పురుషులును, 'మాలపల్లె' మున్నగు విఖ్యాత గ్రంథకర్తలును, శారదా నికేతన సంస్థాపకులును నగు శ్రీ ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులుగారి కెంతయు కృతజ్ఞులము.

ఇదమహ మనృతాత్ సత్య ముపైమి

# అభిప్రాయము



ఆర్యసమాజమను నీచిన్నపుస్తకమునకు పీఠిక వ్రాయ నా కవకాశము గలిగినందుకు సంతసించుచున్నాను. ఈ సమాజ స్థాపకులయిన దయానందసరస్వతీస్వాములవారు శ్రీ శంకరాచార్యులవారి తరువాత ఆర్యమతోద్ధారకులన నొప్పియున్నారు. శ్రీ రామానుజాది ఆచార్యులు వైదికమతమును సంస్కరించిరి గాని ఆర్యమతము నంతమొందింప నుద్యమించిన అవైదిక మతములతో బోరి వైదికమతమును సుస్థాపితము చేయు పని వారిపై బడలేదు. అవైదికములగు బౌద్ధ, జైన మతములు భరతఖండము నంతటను వ్యాపించి వైదికమతము కొనయూపిరితో నున్నకాలములో శ్రీ శంకరు లవతరించి జైన బౌద్ధ మతముల రూపుమాపి, ఆర్యుల నందరిని వైదికమతముయొక్క ఆవరణములోనికి తీసికొనివచ్చినారు. మఱియును అప్పటికి భరత ఖండములో ప్రవేశించి స్థిరవాసముల నేర్పరచుకున్న భారతీయేతరజాతుల నందరినిగూడ వైదికమతముయొక్క ఆవరణము లోనికి చేర్చినారు. షణ్మతస్థాపనాచార్యుడని బిరుదము నొందుటచే ఆయన ప్రత్యేకముగ నొక మతమును స్థాపింపక తన భాష్యములను కంచెగోడలతో, వైదికముల నన్నిటిని సంర

క్షించినారు. శ్రీ రామానుజ మధ్వాచార్యులు శ్రీ శంకర మతమును దిద్దినారు.

శ్రీ దయానంద సరస్వతి యవతరించునప్పటికి భరత వర్షమున వైదికమతము నామమాత్రావశిష్టమయినది. ఆంగ్ల విద్యార్థులు లెల్లరును వైదికమతమునకు విముఖులై యుండిరి. పామరులు శరవేగమున క్రైస్తవ మహాసముద్రములోనికి బ్రవహించుచుండిరి. శ్రీ శంకరాదులు వేసిన కంచె లన్నియు కంతలుబడి చెడుగొడ్లన్నియు లోనికి బ్రవేశించి మేయసాగినవి. వాటి నదలించువా రెవ్వరు లేరైరి. ఆర్యజాతి శవరూపమును బొంది ఏ యవయవము నెవ్వరు గోసికొని పోయినను తెలియక స్మృతిదప్పి పడియుండెను.

అప్పుడు దయానందసరస్వతి యవతరించినారు. *దివ్యజ్ఞానసమాజమువారును బ్రహ్మజ్ఞాన సమాజమువారును ఆర్యజాతిని ప్రబోధింప కొంతవరకు ప్రయత్నించుచుండిరి. శ్రీదయా

* దివ్యజ్ఞాన సమాజము (థియసాఫిస్టు సొసైటీ) మొదట అమెరికాలో స్థాపింపబడినది. ఈ మత స్థాపకులు శ్రీమతి బ్లావెట్‌స్కీసతి శ్రీయుత కల్నల్ ఆల్కాటుగార్లు. వీరు దయానందుని ప్రతిభాది విశేషములు గాంచి ఆయన దర్శనమునైనను చేయకయే ఆయనను తమ ఆధ్యాత్మిక గురువుగా నంగీకరించి దివ్యజ్ఞాన సమాజమును ఆర్యసమాజము

నంపులు మొదట వారికి దోడ్పడ నుంకించెనుగాని వారి ధర్మ ములు అవైదికము లగుటచే నవి నచ్చలేను. శ్రీ ఆదిశంకరులు షణ్మతముల నంగీకరించుటచే అవి యంతఃకలహాములకు కారణములై ఆర్యజాతిని భిన్నభిన్నము గావించినవి. షణ్మతములవారు తా మందఱును వైదికుల మనుసంగతియె మఱచిపోయి ప్రథమగణ్యములైన వేదములకంటె తరువాతబుట్టిన తమ తమ సాంప్రదాయ వాఙ్మయమునకే ప్రాధాన్యము నిచ్చుచుండిరి. ఆర్యమతమునకు ప్రమాణగ్రంథ మేది యని యడిగినచో తమలోని పరస్పరభేదముల దెలుపు అద్వైతము విశిష్టాద్వైతము, ద్వైతము, చైతన్యమతము, వల్లభాచార్య మతము, అను వానిభేదములను దెలుపు వాఙ్మయ గ్రంథములనే చెప్పుచుండిరిగాని తమ మతము వైదికమనిగాని,

---

నకు శాఖగా జేయ ప్రయత్నించిరి. కాని భరతఖండమునకు వచ్చి నంతనే (ఆర్యసామాజికులు స్వర్గ నరకములను ప్రత్యేకముగా నొప్పుకొనరు గావున) దివ్యజ్ఞాన సామాజికులకును దయానందునకును భూతా ప్రేతాది విషయములలో సామరస్యము కుదురలేదు. అందుచే నీయననుండి వారు వేరైరి.

దీని సారాంశము: దివ్యజ్ఞాన సమాజ మీ దేశములో స్థాపింపబడినది దయానందమహర్షి యనంతరమే కాని తత్పూర్వము కాదు.

మదనమోహాన విద్యాధర్

తమ ప్రమాణగ్రంథము వేదమనిగాని చెప్పలేకుండిరి. శ్రీ దయానందు లీస్థితిని గనిపెట్టినారు. మహమ్మదీయులు తమ ప్రమాణగ్రంథము కొరానననియు క్రైస్తవులు బైబిలని చెప్పుకొనుట కనిపెట్టినారు. ఉపనిషత్తులు, భగవద్గీతలు, బ్రహ్మసూత్రములు, శివగీతలు అను పేరులను, వానిమీది ఆ యా సాంప్రదాయ భాష్యముల పేరులును మాత్రమే ఉచ్చరించబడుచు వేదములయొక్కయు, షడంగములయొక్కయు పేరులు మృగ్యము లగుటకు వగచినారు. ఇవియన్నియు అప్రమాణములని ఆయన చెప్పక వేదములకు సంబంధించిన ఇటీవలి వాఙ్మయమంతయు వేదములకు భిన్నముకానంతవరకే ప్రమాణములని చెప్పినారు. ఆర్యులకు స్వతఃప్రమాణ మయినది వేద మొక్కటియేయని చెప్పినారు. షడంగములు, బ్రాహ్మణములు, ఉపనిషత్తులు, వేదమంత్రములయొక్క అర్థములను, ప్రయోగములను, వివరము దెలుపునవి. భగవన్ముఖమునుండి వెలువడిన వేదమంత్రములే ఆర్యులకు స్వతఃప్రమాణములు. శ్రీ దయానందులు శ్రీ ఆదిశంకరులవలె వేదములకు ఇటీవలి వాఙ్మయమును స్వతఃప్రమాణముగ అంగీకరింపక, వీలుకొరకని షణ్మతములు స్థాపింపక, వేదమంత్రములే స్వతఃప్రమాణములనియు వేదమతమే ఆర్యమత మనియు స్థిరపరచినారు. దయానందుని ఉద్దేశములో వేదమే ప్రమాణము, వేదమతమే మతము.

దయానందు డవతరించిన కాలమున వేదముల పఠించి అర్థము దెలిసికొన ప్రయత్నించువారే లేరైరి. పండితులెల్లరును ప్రస్థానత్రయమే శరణముగ నుండిరి. మీమాంసకులైతే వేదములకు స్వరప్రాధాన్యమేగాని అర్థప్రాధాన్యము లేదనుచుండిరి. వేదాధ్యయనము అంతరింపకుండుటకై వేదముల నధ్యయనము చేయ నియమింపబడిన కొందరు, తక్కిన బ్రాహ్మణులు వేదములనే చదువకూడదనిరి. కాలదోషము పట్టినదనిరి. క్షత్రియులు నిజమయిన క్షత్రియులు కాదనిరి, వైశ్యులను నిజమయిన వైశ్యులు కాదనిరి. స్త్రీలు శూద్రులు వేదములు చదువకూడదనిరి. క్రమముగ తాము వేదాధ్యయనము మానివేసిరి. ఇది చూచి శ్రీ రామానుజులు అరవపాటలకు కూడ ద్రావిడవేదమను పేరుబెట్టి అవి చదివినను చాలుననిరి. వైష్ణవ బ్రాహ్మణులు అరవపాటలతోనే తృప్తినొందుచున్నారు. శైవమతస్థాపకులైన శ్రీ బసవేశ్వరులు శ్రీ రామానుజుల కంటె నొకమెట్టు ముందుకు బోయినారు. వేదములను బ్రాహ్మణులుతప్ప ఇతరులు చదువకూడదనుచున్నారు గనుక అవి పక్షపాతముగలవి, కావున అవి నిజమైన వేదములుకావు. అని మానవుల కందరికిని పనికిరానిచో మనకును పనికిరావు. కనుక అవి త్యాజ్యములనిచెప్పి అందరికిని పనికివచ్చులాగు క్రొత్తవేదముల వ్రాయించినాడు. శైవుల వేదము బసవపురాణము.

శ్రీ రామానుజ బసవేశ్వరులవలె సర్వజనులకును ఉపయోగింపదగిన క్రొత్త వేదముల వ్రాయించకను పాత వేదముల త్యజించకను ఈ క్రింద నుదహరింపబడిన యజుర్వేద మంత్రము ననుసరించి

"యథేమాం వాచం కల్యాణీ మావదాని జనేభ్యః
బ్రహ్మరాజన్యాభ్యాం శూద్రాయ చార్యాయచ
స్వాయ చారణాయచ"

అర్థము:- "పరమేశ్వరుడీ కళ్యాణకరమగు పవిత్రవాణిని బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర, భృత్యాదిసర్వ జనులకొరకై యుపదేశించెను" అని శ్రీ దయానందులు లోకమున కంతకును చాటి భగవానుడీ లోకులందరును తరించుటకై వేదముల ప్రసాదించెననియు అవి ఒకరి సొమ్ము గాదనియు స్పష్టపరచెను.

ఈ నాలుగుజాతు లెవరు? వీనినిగూర్చి శ్రీ దయానందుని అభిప్రాయ మేమి?

యజుర్వేదమున పురుషసూక్తమున నిట్లు చెప్పబడినది.
బ్రాహ్మణోఽస్య ముఖ మాసీత్
బాహూ రాజన్యః కృతః
ఊరూ తదస్య యద్వైశ్యః
పద్భ్యామ్ శూద్రోఽజాయత.

వేదము విరాట్ పురుషునియొక్క విశ్వరూపమును వర్ణించుచు విరాట్ పురుషునియొక్క కేశములు ఆకాశమనియు సూర్యచంద్రులు కండ్లనియు ఇత్యాదిగా వర్ణించుకొనివచ్చుచు ఆ వర్ణనలో నొక భాగముగ పై శ్లోకము చెప్పబడినది. బ్రహ్మ యొక్క నోటిలోగాని, మఱియొక్కడనుగాని ఎవరునుగాని పుట్టినట్లు దీనియర్థము గాదు. ఆయా జాతుల గుణములను కర్మలను మాత్రము తెలియపరచుచున్నది. ఈ యర్థమునే శ్రీ గీతాచార్యులు,

చాతుర్వర్ణ్యం మయా సృష్టం
గుణకర్మవిభాగశః

అని సృష్టియందన్నిదేశములయందును స్వాభావికము గనే గుణములనుబట్టియు కర్మములను బట్టియు విభాగముగ సృష్టించుచున్నానని చెప్పియున్నారు.

ఇవి జన్మచేత కలుగవని భారతమున ధర్మరాజు నహుషప్రశ్నల కుత్తరముగ నీక్రింది శ్లోకమున చెప్పినాడు.

జాతి కుల వృత్త స్వాధ్యాయాపలలో దేనిచేత ద్విజుడు కాగలడో తెలుపుమని యడుగగా

న జాతి ర్న కులం తాత న స్వాధ్యాయః శ్రుతం నచ
కారణాని ద్విజత్వస్య వృత్తమేతస్య కారణం.

అని నడవడి యొక్కటియే కారణమని తెలుపబడినది. ప్రపంచమంతటను ఈ సంస్కృతపు పేరులు పెట్టుకొనకున్నను

జనులెల్లరును, గురువులు, సైన్యము, వర్తకులు, (కృషి, వాణిజ్య పశుపాలకులు) కూలీలు అను నాలుగు జాతులుగనే యుండెదరు. మఱియైదవ జాతి కనుపడదు. అందులకే మనువు, "బ్రాహ్మణాః క్షత్రియాః వైశ్యాస్త్రయో వర్ణా ద్విజాతయః చతుర్థ ఏకజాతిస్తు శూద్రో నాస్తితు పంచమః"

మఱియును అందరు మనుష్యులును పుట్టినప్పుడు ఒకే విధముగ శూద్రులుగ నుందురు. సంస్కారమువలన తక్కిన జాతులలో చేర్పబడుదురు. మనువే "జన్మనా జాయతే శూద్రః సంస్కారై ర్ద్విజ ఉచ్యతే" అని చెప్పెను. కనుక ఇప్పటి మోస్తరుగ జన్మచేత ద్విజత్వము వచ్చుననుట వైదిక మతము కాదనియు సంస్కారములచేత ఆయాజాతులుగ జనులు మారుదురనియు శ్రీ దయానందుని యభిప్రాయము. అందుచే ఇప్పుడు ♦ హిందువు లనిపించుకొనుచున్న అన్నిజాతులవారును క్రొత్తగ ఆర్యమతమును స్వీకరించు అన్యమతస్థులును వారియొక్క సంస్కారముల ననుసరించి వివిధవర్ణములుగ నేర్పడుదు రనియు శ్రీ దయానందునిమతము.

గాంధిమహాత్ముడు అస్పృశ్యతను బోగొట్టి హరిజనులను దేవాలయములలో ప్రవేశపెట్టుట, వర్ణాశ్రమ ధర్మముల నంగీకరించునట్టి వైదికధర్మమునకు వ్యతిరేకము కదాయని కొందరు

---

♦ 'హిందూమతము' అనుపేరును ఆర్యు లొప్పుకొనరు. 'ఆర్యమత'మనియే వారు దానిని పిలుతురు.

సందేహించుచున్నారు. కాని యీసందేహమున కేమియు తావు లేదు. వర్ణధర్మములు జన్మముచే గలుగునని యంగీకరించినను వేదములు అందరికిని తరణోపాయము గలిగించునవి గనుకను మనువు ప్రకారము పంచమ జాతియే లేదు గనుకను ఒకవేళ శూద్రులలో నంత శ్శాఖగా పంచమజాతి మొదట యేర్పడి తరువాత పంచమజాతి యేర్పడినను పై నుదహరింపబడిన 'యథేమాం'అను శ్రుతి వేదము లందరికిని తరణోపాయములని చెప్పుచుండుటచే శ్రుతికి భిన్నముగా ఇటీవలివా రెవరైనను భిన్నాభిప్రాయములను వర్ణ ధర్మములుగ జెప్పినను ఏడు కోట్లమానవులను ఆ యల్పవాక్యములు అధఃపతితులను జేయజాలవనియును, శ్రుతివాక్యమను గండ్రగొడ్డలితో వానినెల్ల ఖండింపవచ్చుననియు శ్రీ దయానందునియభిప్రాయము.

దేశములో వైదిక ధర్మము నశించుటకు ఆర్యజాతి స్వాతంత్ర్యమును గోల్పోవుటయే ముఖ్యకారణమని శ్రీ దయానందులు గ్రహించినారు. పాంచాల సింధు కాశ్మీర వంగదేశములలో ఆర్యు లల్ప సంఖ్యాకు లగుటకును దక్షిణ దేశమున పామరులెల్లరు అన్యమతప్రవిష్టులగుటకు క్రమముగా నాగరికులలోనికికూడ పరధర్మము ప్రాకుటకునుగూడ పారతంత్ర్యమే కారణమని శ్రీ దయానందులు గ్రహించినారు. ఆంధ్రులు దక్షిణదేశమున ఆర్యమతమును గాపాడిరి. మహారాష్ట్రులు ఆర్యరాజ్యమును పునరుద్ధరించిరి. కాని పాశ్చాత్యులు

మహారాష్ట్రిలలోని యంతఃకలహములచేత దేశమును స్వాధీన పరచుకొనిరి. క్రైస్తవాగ్ని దేశము నంతటను అంటుకొని విజృంభించుట దయానందస్వామికి హృదయభేదక మయ్యెను.

దయానందుడు యోచించెను. ఆర్య జాతినంతను సంఘటింపజేసి వేదమను ఒక్క త్రాటను గట్టివేయనిచో వివిధ మతశాఖలచే భిన్నభిన్నమయియున్న ఆర్యజాతి మహమ్మదీయ క్రైస్తవమతముల నెదుర్కొని నిలువజాలదని యతడు గ్రహించి వేదమతమును స్థాపించెను. ఇది స్వామి జేసిన మొదటికార్యము. ఇప్పటికి నిలచియున్న ఆర్యుల నందరిని సంఘటింపజేసి అన్యమత ప్రవిష్టులు గాకుండ జేయుట సాధ్యమయినను, కోట్లకొలది ఆర్యు లిదివరకే అన్యమత ప్రవిష్టులై యుండుటచేతను వారిని తిరిగి మాతృమతములోనికి స్వీకరించుటయు, వేదమును మానవులందరికిని తరణోపాయముగ భగవానుడు ప్రసాదించియుండుటచే అన్యమతములవారికిగూడ ఆర్యమతములో ప్రవేశించుట కవకాశ మిచ్చుట సామాన్యధర్మమనియు నమ్మియుండుటచేత శుద్ధి సంస్కారము ఏర్పరచి తన్నిమిత్తమై ప్రచారకులను నియమించి వైదికధర్మవ్యాపకత్వమున కుద్యమించెను.

కాని యిప్పుడు ఆర్యులలో వర్ణములన్నియు వంశపారంపర్యముగ జన్మచే గలుగునని విశ్వసించుటచేత అన్యమతస్థులనుగాని, లేక అన్యమతములలో జేరి ఇతరులతో వివాహాది

సంబంధములు గలిగించుకొనిన ఆర్యులనుగాని ఆర్యమతము లోనికి జేర్చుకొనినయెడల నూతనముగా ఆర్యమతములో ప్రవేశించినవారు వారిగుణకర్మలనుబట్టి ఆయావర్ణములలో చేరుటకు జన్మచే వర్ణములు కలుగునని విశ్వసించువారు తమలో చేర్చుకొనుటకు అంగీకరించక ఆర్యమతములోనికి క్రొత్తగా అన్యమతస్థులు చేరుటకే శాస్త్ర మంగీకరించదనువాదములు బయలుదేరినవి. నీళ్ళు లోపలికి ప్రవహించు వరవల కడ్డముగొట్టి నీళ్ళు వెళ్ళిపోవు అలుగులను తీసియుంచిన తటాకము కొద్దికాలములో వట్టిపోవుట తప్పనివిధముగా ఆర్యమతస్థులు ధారాళముగా ఇతర మతములలోనికి వెళ్ళుటకు అవకాశము లిచ్చి ఇతర మతస్థులు తమలోనికి రాకుండ ఆటంకపెట్టినయెడల ఆర్యమతము నిలువగలదాయను సందేహము పీఠస్థుల మనస్సులను బాధించుట లేదు. ఆర్యమతము మఱికొంతకాలమిా సనాతనుల పాలనలో నుండునెడల అది సంపూర్ణముగ నశింపకమానదని శ్రీదయానందుడు గ్రహించెను. శ్రీ ఆదిశంకరులు తనకాలములో దేశమంతను వ్యాపించియున్న జైన, బౌద్ధ మతస్థులను దేశములో నివాస మేర్పరచుకొనిన ఇతర విదేశీయులను ఆర్యమతము లోనికి చేర్చుకొనినట్లే శ్రీ దయానందుడు శుద్ధి సంస్కారమను సంస్థ నేర్పరచి క్రొత్తవారిని ఆర్యులలో చేర్చుకొనుటకు సాగించి విజయము గాంచెను.

ఆర్యసమాజములోని యింకొక విషయము గూడ నచ్చినది. శైవులలోను, వైష్ణవులలోను వీరశైవులనియు, వీరవైష్ణవులనియు శాఖ లున్నవి. వీరు తీవ్రవాదులు. ఆచరణలో కొంత తేజోమార్గము నవలంబించువారున్నారు. ఆర్యసామాజికులు ఇతరమతస్థులపై బలప్రయోగము చేయకున్నను తమ మత సంరక్షణకై ప్రాణము లర్పింతురు. తక్కిన హిందువు లట్లుగాదు. ఇతరమతస్థు లెదురైనప్పుడు చాలచోట్ల పారిపోవుదురు. ఇప్పుడు దేశములోనున్న హిందూమతస్థులందరును ఆర్యసమాజ ధర్మములను అన్నిటిని స్వీకరింపలేకపోయినను ఈ కడపటి సుగుణము నయినను వారినుండి గ్రహించుట యుక్తము.

శ్రీ దయానందుడు ఆధునిక ఆర్య ధర్మోద్ధారకుడు, హిందూసంఘ నిర్మాత. శ్రీ దయానందుని పంథా ననుసరించి ఆర్యసంఘము తిరిగి తలయెత్తి లోకమునకు మన ప్రాచీన మహర్షుల సందేశమును వెల్లడించుగాకయని విశ్వసించుచున్నాను.

వున్నవ లక్ష్మీనారాయణ



# ఆర్యసమాజము ?

## ప్రథమాధ్యాయము

మహాభారత భీషణసంగ్రామము తరువాత నతివేగముగ భారతవర్షము పతన మొందనారంభించెను. దీనికితోడు విదేశీయులు భారతము నాక్రమింపఁదొడఁగిరి. కొన్నిశతాబ్దములపూర్వ మీభారతము నాలుగువిధములగు భిన్న భిన్న పరిస్థితులలోఁ చిక్కుకొనెను.

1 ఆర్యజాతియందు వివిధమతములు వ్యాపించెను. ప్రతిమతము వేరువేరుగా తనస్థితి నేర్పరుచుకొనెను. అందువలన ధర్మక్షేత్రమున నరాజకత యేర్పడెను.

2 భారతవర్షమున మహమ్మదీయమత మడుగు పెట్టుటతోడనే యిట నొకవిచిత్రపరిస్థితి యేర్పడినది. హిందూజాతి కది విశేషహానికారక మయిన దనుట కెట్టి సందియమును లేదు.

3 కొలదికాలమునకుతరువాత క్రైస్తవులును నిట కరుదెంచి తమ సంప్రదాయజాలమును ప్రసరింపసాగిరి.

వీ రేవిధముగా నైనను హిందువులను క్రైస్తవు లగు నట్లు జేయ నుద్దేశించిరి.

మహమ్మదీయమత ము త్తరభారతమున నెలవు చేసికొనెను. క్రైస్తవమతము దక్షిణమున విజృంభించెను. ఈ రెండుధర్మములు భారతవర్షమును దిగ్రమింగి భారతీయధర్మమును, భాషను, సభ్యతను నష్ట మొనర్పబూనెను.

౪ ఆంగ్లేయులు భారతమునకు వచ్చినదాదిగా నిట నొక క్రొత్తప్రవాహము బయలుదేరెను. భారతీయులు తమగృహములందే విదేశీయులు కాజొచ్చిరి. పాశ్చాత్య శిక్షాపద్ధతి భారతీయులమనస్సున దాసత నాపాదింప జేసినది. క్రమముగా భారతీయులు మాతృభూమిని సభ్యతను, భాషను, సేవగింపమొదలిడిరి. అందువలన నన్నివిధముల భారతమున వైదేశికత ప్రవేశించినది. పాశ్చాత్యశిక్షణవలన భారతనవయువకులు తమశాస్త్రములను విజ్ఞానమును విరోధింపనారంభించిరి.

ఇవిగాక యార్యజాతియం దనేకములగు నాంతరిక భేద భావము లను రోగములు విరివిగా వ్యాపించెను. దాని నధర్మ మను ముక్కపురుగు తిననారంభించెను. ఆర్యజాతి యనేక భాగములలో విభక్తమయ్యెను. జన్మమూలక జాతిభేదములు దానిని భిన్నభిన్న మొనర్చెను. ఆర్యసంతానములు సత్యస్వ

రూపుడగు నాపరమేశ్వరు నుపాసించుట మాని జడమూర్తుల నారాధింపదొడగినవి. ఏకేశ్వరారాధన స్థానమున నానాక్షుద్ర దేవతలు పూజింపబడసాగెను. కొన్నిపట్ల వేలకొలది యసత్పు రుషులు గురువులై తామే యీశ్వరులమని మూఢజనులచే నంగీ కరింపజేసి పూజింపబడుచుండిరి. సత్యమునకుబదు లసత్యము ధర్మమునకుబదు లధర్మమును సేవింపబడుచుండెను. పరస్పర సహానుభూతిగల సామాజికధర్మమునకుబదులు వ్యక్తిధర్మము ముక్తిసాధనముగా నెంచబడసాగెను. జనులు ధర్మస్వరూప మును గుర్తింపక బాహ్యచిహ్నములను ధర్మమనియెంచి యనేకవిధములగు ఆచారములలో చిక్కుకొనిరి. నా డార్య జాతి మరణించినభర్తశవమును కౌగలించి విలపించు ననాథ స్త్రీవలె శోచనీయదశను బొందెను.

ఆసమయమునందే ప్రపంచమున నలుగడల భౌతిక వాదము భీషణరూపమున ప్రబలజొచ్చెను. దిన మొకవిధమున నభివృద్ధిగాంచు విజ్ఞానవాదము ఆధ్యాత్మికతను ధార్మికతను కప్పివేయదొడగెను.

అందువలన ప్రపంచమునకు విశేషముగా భారతవర్ష మున కాసమయమున నొకవిశిష్టసుధారకు డవసరమయ్యెను. భారతీయులను మేల్కొల్పుటకు తోడుగా ప్రపంచశాంతికి దారిజూపు మహానాయకుడు లభింపవలసియుండెను. అపరిమిత వృద్ధినిగాంచు భౌతికవాదము ప్రపంచమున భయంకరసంహార

మొనర్ప ననువగు యోజన చేయసాగెను. జనులలో ధర్మమున నేవగింపు గలుగుచుండెను.

౧౮౨౪ సం. న దయానందుడు భారతమున జనించెను. దయానందమహర్షి బాల్యకాలమున 'మూలశంకరజీ దయారామ్' అనబడుచుండెడివాడు. అతడు కాఠియవాడ్‌లో మోర్వీరాజ్యమున టంకారానామక గ్రామమున నుద్భవించెను. అతనితండ్రిపేరు పండిత కర్షన్‌జీ త్రివేది. వారు సామవేదీయ ఔదీచ్యబ్రాహ్మణులు, శైవసాంప్రదాయకులు. వారికి సంపత్తి పుష్కలముగా నుండెను. కర్షన్‌జీ మోరవీరాజ్యమున కలెక్టర్ పదవిలో నుండిరి.

మూలశంకరుడు చిన్నతనమునుండియు ప్రతిభాశాలి, మేధావి, విరక్తస్వభావము కలవాడునై యుండెను. ధార్మిక జ్ఞానమును సంపాదించుకోరిక వానిలో ప్రబలముగా నుండెను. బాల్యకాలముననే యజుర్వేదము నతడు కంఠస్థ మొనర్చెను. పదునైదేండ్లవయసున నత డొకమారు శివరాత్ర వ్రతమును నిర్వర్తింపబూనెను. దినమంతయు నుపవాస మొనర్చి రాత్రియం దతిశ్రద్ధతో భక్తిభరిత హృదయముతో శివదర్శన లాలసుడై తండ్రితో మందిరమున కేగెను. అక్కడ జరిగిన యొక చిన్నసంఘటన మూలశంకరుని జీవనప్రవాహమును మార్చివైచెను.

మూలశంకరుని హృదయమున జగదీశ్వరుని దర్శించు కుతూహలము మిక్కుటముగా నుండెను. అట మందిరమున శిలానిర్మితమహాదేవు డుండెను. దాంభికభక్తు లెల్లరు నిద్రాముద్రితులైరి. మూలశంకరు డతియత్నమున జాగరణ మొనర్చుచుండెను. అతనితో బాటొక తైలదీపముమాత్రము తన చిన్నికాంతులను మందిరమున వెదజల్లుచుండెను. ఆనిశీథసమయమున నొక చిట్టెలుక శివమూర్తిని సమీపించెను. అది మూర్తిపై నెక్కి యిటునటు దుముకుచు భక్తులచే నర్పింపబడిన పూజాద్రవ్యముల నుచ్ఛిష్ట మొనర్చుచుండెను. ఈవింతచర్యను జూచుచున్న బాలకునిమనమున సందేహము జనింపసాగెను. మహాదేవునిపుత్రు డయినగణేశుని వాహనము నేడు మహాదేవునిపై నెక్కుట చూడ బాలకునిమనస్సు నేల కలతపెట్టదు? అతనికి "మందిరమునగల శిలావిగ్రహము వాస్తవముగా నీశ్వరుడేనా" యని సందేహము జనించెను. తర్కవితర్కములపై కాదని యతనికి నిశ్చయము కలిగెను. వాస్తవముగా నీశ్వరజిజ్ఞాస యతనిమనసున నేర్పడెను.

కొంతకాలము గడచెను. ఒకనా డతనిసోదరి రోగగ్రస్తయై మృత్యుముఖమున బడెను. మూలశంకరుని హృదయగతి రుద్ధమయ్యె. అతనియశ్రువులు శుష్కించెను. అనేక దినము లతనిహృదయమున జన్మమరణసమస్య ముప్పిరిగొనసాగెను. ఇట్లు మరికొంతకాల మతిక్రమించెను. ఆబాలకు

నతిమాత్రమున ప్రేమించు పినతండ్రికూడ పంచత్వము నొందెను. బాలకహృదయమున నిరుద్ధమైనప్రేమ వెల్లువయై ప్రవహించెను. అతడు కన్నులువాచునట్లు విలపించెను. మృత్యుసమస్య మరింత జటిలమై యతనికి తోచెను. భగవానుడగు బుద్ధుని వలె సంస్కృతహృదయుడగు మూలశంకరునకును మృత్యుసమస్యను పరిష్కరించి యమృతపదము నధిగమింపవలయు ననుకోరిక ప్రబల మయ్యెను.

సత్యస్వరూపుడగు నీశ్వరు నెరుంగుటకు నమృతజీవనమును సంపాదించుటకును మూలశంకరుని హృదయమున దృఢసంకల్ప మేర్పడెను. ఈకోరిక గృహమధ్యమున నెరవేరుట సంభవము కాదయ్యె. విశాలప్రపంచమే సఫలతాక్షేత్రమై యుండెను. అందువలన నుద్దేశపూర్తికై గృహమును వీడి ప్రపంచమున నడుగిడ సమయమును ప్రతీక్షించుచుండెను.

తల్లిదండ్రులకు మూలశంకరుని వైరాగ్యవృత్తి సందేహజనక మయ్యెను. వివాహ మొనర్చి సాంసారికవిషయములందాసక్తి గలిగింపనెంచి వేగముతో నట్టియత్నములు సలుపనారంభించిరి.

ఒకనాటిరాత్రి గృహమున వివాహసంరంభములు జరుగుచుండెను. మూలశంకరుడు తలిదండ్రులకు తుదినమస్కారము మనస్సుననే యొనరించెను. గృహమును విడిచి యరణ్యా

మార్గమును గ్రహించెను అత డేయేగ్రామములను నగరములను నదులను దాటెనో, ఏయే పర్వతప్రాంతముల చరించెనో, ఎట్టి భయంకరమృగసముదాయములమధ్య రాత్రులు గడిపెనో, యెరికి దెలియును? పదునైదు పదునారువర్షములకాలము భారతమున నొకమూలనుండి మరియొకమూలకు సంచారమొన ర్చెను. వందలకొలదిసాధువులను సంన్యాసులను, యోగులను సందర్శించెను. అనేకవిధములగు యోగాభ్యాసముల నేర్చుకొనెను. పలుశాస్త్రముల నభ్యసించెను. కాని యతని యాత్మకు తృప్తి కలుగదయ్యె. ఈ యాత్రలో నొకచో పూర్ణానందసరస్వతి నామకమహాత్ము డొక డతనికి లభించెను. అతనినుండి సంన్యాసమును గ్రహించి మూలశంకరుడు దయానందసరస్వతి యయ్యెను.

యమునాతీరమున ప్రజ్ఞాచక్షువగు విరజానందస్వామి నామక సంన్యాసి యొక డుండెననియు, నతడు ప్రాచీనార్ష గ్రంథములకు ప్రకాండపండితుడనియు, వ్యాకరణమున జగద్విఖ్యాతపండితుడనియు దయానందునకు తెలిసెను. వెంటనే యతనియాశ్రమమునకు జేరి తలుపు తట్టెను. లోపలనుండి నీ వెవరవు? ఏమి చదివితివి? అని ప్రశ్నలు వినబడెను. అందులకు బదులు దయానందుడు తననామమును, చదివినగ్రంథములను చెప్పెను. అనార్ష గ్రంథములను యమునలో పడవేసి రమ్మని లోపలనుండి యాదేశము వినబడెను. దయానందుడును

వెనుకముందాడక తనచెంతనున్న అనార్ష గ్రంథముల నన్నిటిని యమునలో ప్రవహింపజేసి తిరిగి యాశ్రమమున కరుదెంచెను. రెండున్నర సంవత్సరములకాలము గురువుల పాదమూలమున ఆర్ష గ్రంథముల నభ్యసించెను. యోగ్యుడగు గురుముఖమున నార్యధర్మమునకు మూలభూతములగు వేదవేదాంగముల నభ్యసించి దయానందుడు తనహృద్గతసంశయముల నన్నిటిని దూర మొనర్చుకొనెను. అతనియాత్మ జ్ఞానజ్యోతితో దేదీప్యమానమయ్యెను. దీర్ఘకాలము పరిభ్రమణ మొనర్చి శారీరిక తప మొనర్చి యిపుడు గురుసమీపమున నాధ్యాత్మికసాధనను సంపూర్ణ మొనర్చెను.

విద్యాసమాప్తి యగుటతోడనే గురుదక్షిణసమయ మరుదెంచెను. కౌపీనధారియగు దయానందుని చెంత నేమున్నది? గురువు లవంగములను ప్రేమతో నంగీకరించెడివాడు. దయానందు డెట్లో యొక దోసెడు లవంగములను సంపాదించి గురుసన్నిధి నుంచెను. విరజానందయతి యది తెలిసికొని 'దయానందా! నీవలన మరియొక దక్షిణనపేక్షించుచుంటి'ననెను. దయానందుడు నతశిరస్కుడై "స్వామీ! దయానందుడు ప్రాణములతోసహా సర్వస్వము నర్పింప సిద్ధముగా నున్నాడు. ఆదేశింపు"డనెను.

గురు వాశీర్వదించి గద్గదకంఠముతో 'దయానందా! చదువవలసినది పూర్తి జేసితివి. ధర్మాధర్మములను సత్యాసత్య

ములను వివేకించు సుబుద్ధి నీకుగలిగెను. ప్రస్తుత మార్యావర్త మున నార్యత్వము నశించి యధర్మ మంతటను వ్యాపించుచున్నది. పండితమ్మన్యులగు బ్రాహ్మణులు స్వార్థపరులై వేదార్థములను సరిగా నెరుంగజాలక వేలకొలది దేవీదేవతలను కల్పించి జడ పూజలను ప్రారంభించిరి. ఇంతియగాక వర్ణాశ్రమవ్యవస్థలు నష్టప్రాయము లైనవి. దయానందా! నీ విటనుండి వెళ్ళి నీ నేర్చిన యీశ్వర ప్రదత్తజ్ఞానమును ప్రపంచమున వెదజల్లుము. మిథ్యాచారములను అంధవిశ్వాసములను దూరమొనర్పుము. ఇవి యార్యుల వ్యక్తిసమష్టిశక్తులను నశింపజేయుచున్నవి. ఇదియె నాకోరిక.'

శిష్యుడు గురుచరణములందు శిరము నుంచి నమస్కరించెను. వృద్ధగురువు తనకంపించుచున్న హస్తముతో శిష్యుని మూర్ధమును స్పృశించి రెండు మూడు స్నేహాశ్రువులను రాల్చెను. దయానందుడు బాల్యమున జ్ఞానము నన్వేషించుటకు గృహమును త్యజించెను. నేడు ప్రపంచమున జ్ఞానపుష్పముల వెదజల్లుటకై గురుకుటీరమును విడిచెను.

దయానందుడు నేడు కేవలము పుస్తకపండితుడు గాడు. సమాధినిష్ఠుడై మంత్రార్థముల నెఱింగిన మహర్షి. అతడు తన ప్రచారమునకు వేదముల నాధారముగా గొనెను. భారతీయ శాస్త్రము లన్నియు నీవేదములతో సంబంధము గలిగియున్నవి.

"వేదోఽఖిలో ధర్మమూలమ్" అని మనువు వక్కాణించి యున్నాడు.

వైదికధర్మమును పునరుద్ధరించుటకు ధర్మముపేరిట ప్రచలితములగు నధర్మములను ఖండించుటయు, అసత్యమతముల దూరమొనర్చి వానిస్థానమున వైదికమతమును స్థాపించుటయు నవసరమని ఋషికి తోచెను. అందువలననే దయానంద మహర్షి భారతమున నేమి, ప్రపంచమున నేమి, ప్రబలిన మతమతాంతరములలోగల లోటులను జూపి వానిని ఖండించెను. ప్రపంచమునకు వైధికధర్మమే సత్యధర్మమనియు, విశ్వశాంతికి ముఖ్యకారణమనియు బోధించెను. ఈ ప్రచారక్షేత్రమున తన నడ్డగించు విరోధుల నెదుర్కొనుట కత డొక్కడే నిర్భయుడై సిద్ధపడెను. తన నిశ్చయములను వెలిబుచ్చుటలో విరోధి సంఘములమధ్యగూడ వెనుకంజవేసి యెరుగడు.

ప్రపంచమున ధర్మశబ్దార్థ మతిసంకుచితముగా గ్రహింపబడుచుండెను. జనులు కొంతకాలమునుండి తమవంశమున పరంపరగా వచ్చుచున్న యాచారములను గ్రుడ్డితనముగా ననుసరించుటయే ధర్మమని యెంచుచుండిరి. భారతమున ననేకులు "హరేరామ! హరేరామ"........"గంగా గంగేతి యో బ్రూయాత్" మున్నగువానిని పఠించిన మాత్రమున ధర్మపాలన మగునని భావించుచుండిరి. కొందఱు సాంసారికధర్మములను విడుచుటయే పరమధర్మమని యట్లు చేయసాగిరి. మహర్షి

నవతరించెను. భగవానుడగు కృష్ణుని సర్వగుణ సంపన్నత, మహర్షి వేదవ్యాసుని జ్ఞాన గరిమ, బుద్ధభగవానుని నిర్మలత, దానవీరుడగు శిబిచక్రవర్తియొక్కయు, వీతరాగుడగు దధీచి యొక్కయు సర్వస్వత్యాగమును పరమపవిత్రుడగు దయా నందునిలో సమ్మిళితమై యుండెను.

ప్రపంచమున నధర్మము ప్రబలమై యుండుటనుజూచి దయానందుని కోమలహృదయము వ్యథితమయ్యెను. హిమా చలమునుండి లంకవరకు, కచ్ఛినుండి బర్మావరకు, సంపూర్ణ భారతదేశమున నొక ధర్మము, నొక భాష, యొక భావము నేర్పడనంతవరకు, శతాబ్దములనుండి భారతీయుల మనముల నావరించిన కుసంస్కారములు దూరము కానంతవరకు, భార తీయులకు ధార్మిక, రాజకీయ, నైతిక సంగ్రామ క్షేత్రములం దపజయమే కలుగునని ఋషి నిశ్చయించెను.

విశ్వమునగల ధర్మపథికులెల్లరు ధర్మమున కాదిమస్రోత స్సగు వేదతీర్థము వైపునకు నడువకున్నంతకాలము ప్రపం చమున శాంతి కలుగ నేరదని యతని దృఢభావన. అందువలననే మహర్షి ప్రపంచమునగల భ్రామక సిద్ధాంతములకు విరుద్ధముగా వేదావిరుద్ధ తర్కశాస్త్రమును హస్తమున నిడుకొని యనన్య సహాయుడై నిలబడెను.

మహర్షి యొక్క మహోన్నత విచారము నెరుంగక జ్ఞానశూన్యులగు మానవులు పలుచోట్ల వారి నెదుర్కొనిరి.

పలుమారు మహామహుని ప్రాణములు గొన యత్నించిరి. కుట్రలు బన్నిరి. అడుగడుగున మహర్షిని రాళ్ళు రువ్వి గాయ పరచి యవమానించిరి. కాని "పరోపకారాయ సతాం విభూతయః" అను నాదర్శము మూర్తీభవించినదో యన నా మహర్షి దయానందుడు కష్టముల నెదుర్కొనియు తన జ్ఞానవిభూతిని లోకమున కర్పించెను. దయాసముద్రుడగుటచేత తనను నొప్పించిన శత్రువులను నిర్వికారుడై క్షమించెను. ఇట్లు నిరంతరముగా నిరువదియేడు వత్సరముల కాలము నిద్రాణమైయున్న భారతమును మేలుకొల్పుటకై వైదిక సందేశమును జనుల శ్రోత్రముల ప్రతిధ్వనింపజేసెను.

వి. శ. ౧౯౪౦ వ సంవత్సరమున నది దీపావళిదినము. ఋషి రోగశయ్యయందు పరుండియుండెను. మందభాగ్యులగు దేశీయ సోదరులే యతనికి పాలలో గాజుపొడి కలిపి త్రావించిరి. శరీరమున నంతట వ్రణములయి గాజువిషము బయటపడ నారంభించెను. ఈ భయంకరస్థితియందును ఋషివదన మతి శాంతముతో నొప్పుచుండెను. ప్రతి ఉచ్ఛ్వాస నిశ్వాసమునను ప్రణవధ్వని వెలువడు చుండెను! తుది శ్వాసతో "భగవన్ తేరీ ఇచ్ఛా పూర్ణ హో" అను వాక్యము విన నయ్యెను. దయానందుని దివ్యజ్యోతి యనంతాకాశమున లీన మయ్యెను.



# ద్వితీయాధ్యాయము



## ఆ ర్య స మా జ స్థా ప న

దయానంద మహర్షి ప్రపంచశాంతి నుద్దేశించి తాను చేయదలచిన కార్యములను ప్రపంచమున వ్యాపింపజేయుటకై సమాజముల నేర్పరచు టావశ్యకమయ్యెను. ఈ యుద్దేశమును పూర్తిజేయుటకై బొంబాయి మున్నగు ననేక స్థలములలో నార్యసమాజములను స్థాపించెను. ప్రప్రథమమున బొంబాయిలో వి. సం. ౧౯౩౨ చైత్రశుద్ధపంచమిరోజున ఆర్యసమాజము స్థాపింపబడెను. అనంతరము మహర్షి యెనిమిదేండ్లు జీవించి యుండెను. ఆర్యసమాజ మొకక్రొత్తమతముగాని సంప్రదాయముగాని కాదు. సమాజప్రవర్తకుడగు దయానంద మహర్షియు భారతమున క్రొత్తమతమునో సంప్రదాయమునో నడుపనెంచి యుండలేదు. మహర్షి రచిత స్వమన్తవ్యామంతవ్యప్రకాశమున నొకచో నిట్లు వ్రాయబడియున్నది. "వేదాది సత్యశాస్త్రములను, బ్రహ్మ మొదలు జైమినిముని పర్యంత మహర్షులచే నంగీకరింపబడిన నీశ్వరాది పదార్థములనే నేను నంగీకరించుచున్నాను. సజ్జనులయెదుట నిట్లే ప్రకాశించుచున్నాడ. భూతభవిష్యద్వర్తమానకాలములందొకేరూపమున నెల్లరిచే నంగీకరింపదగిన మంతవ్యములే నా మంతవ్యములు.

నా కొక క్రొత్తకల్పనజేయుటకుగాని, మత మతాంతరముల ప్రవర్తింపజేయుటకుగాని లేశమాత్రమైన నభిప్రాయములేదు. కాని సత్యము నంగీకరించి యితరులచే నంగీకరింపజేయుటయు, అసత్యమును విడిచి పరులచే నసత్యమును విడిపింపజేయుట నా కభీష్టములు. నాలో పక్షపాతమున్న యెడల నార్యావర్తమున ప్రచలితములైనవానిలో నొకానొకమతమును విశేషముగా ప్రేమించియుందును. అట్లుచేయక ఆర్యావర్తమునందును అన్య దేశములందును గల ధర్మయుక్తమగు నడవడులను గ్రహించుటకును అధర్మయుక్తవిషయములను త్యజించుటకును కోరుచున్నాడ. అట్లు చేయుటయే మానవధర్మమైయున్నది.

ఆర్యసమాజ నియమములలో నొక నియమముగూడ పై భావమునే తెలుపుచున్నది. "సత్యమును గ్రహించుటకును అసత్యమును త్యజించుటకును నెల్లపుడు సిద్ధముగానుండవలెను. అందువలననే ఆర్యసమాజ మొక వ్యక్తినిగాని వేదాతిరిక్తమగు మరియొక గ్రంథమునుగాని స్వతఃప్రమాణమని యంగీకరింపజాలదు. బ్రాహ్మణ గ్రంథములు, ఉపనిషత్తులు, స్మృతులు, గీత మున్నగు వేదేతరగ్రంథములన్నియు పరతఃప్రమాణములే. ఇవి వేదానుకూలమైనంతవరకు ప్రామాణికములనియు, ప్రతికూల స్థలములం దప్రామాణికములనియు నెంచబడును. ప్రస్తుతమున హిందువులు పురాణముల నెక్కువ ప్రమాణబుద్ధితో జూతురు. బ్రహ్మవైవర్తపురాణమున నొకచో

"వేదప్రణిహితో ధర్మో హ్యధర్మ స్తద్విపర్యయః" అని వ్రాయబడియున్నది. "శ్రుతిస్మృతివిరోధేతు శ్రుతిరేవగరీయసీ" అని దేవలస్మృతి చెప్పుచున్నది. ఆర్యసమాజమును ధర్మనిర్ణయము చేయుటలో వేదము ముఖ్యప్రమాణమని నమ్ముచున్నది.

ఆ ర్య స మా జ ని య మ ము లు

౧ సమస్త సత్యవిద్యలకును, విద్యవలన నెరుంగదగు పదార్థములకు నాదిమూలము పరమేశ్వరుడు.

ఆదిమూల మనగా చేతన నిమిత్త కారణము. కుండను చేయుటలో కుమ్మరి చేతన నిమిత్త కారణము. అట్లే ఈశ్వరు డన్ని సత్యవిద్యలకు విద్యవలన తెలిసికొనదగు కార్యరూప ప్రాకృత పదార్థములకును పరమేశ్వరుడు నిమిత్త కారణ మని భావము. త్రికాలములందు నేకరూపమున నుండు జ్ఞానము సత్యవిద్య యనబడును. అది యీశ్వర, జీవ, ప్రకృతులజ్ఞానము. ఈ జ్ఞానమునకు మూలకారణ మీశ్వరుడే. పరివర్తన జేయదగు జ్ఞానము విద్య యనబడును. బ్రహ్మాండమున పరివర్తించు వస్తువు కార్య ప్రకృతియై యున్నది. ఇదియే సృష్టి యనబడును. పరివర్తించు పదార్థముల జ్ఞానమును పరివర్తనీయమై యుండును. ఈ జ్ఞానముచేతనే సమస్త పదార్థముల జ్ఞానమును కలుగుచున్నది. ఇట్టి సృష్టికి నిమిత్తకారణ మీశ్వరుడే. అందు

వలన నీ నియమార్థము సంక్షేపముగా వేదమునకు సృష్టికి నిమిత్తకారణమని చెప్పవచ్చును.

౨ ఈశ్వరుడు సచ్చిదానంద స్వరూపుడు, నిరాకారుడు, సర్వశక్తిమంతుడు, న్యాయకారి, దయాలుడు, అజన్ముడు, అనాద్యనన్తుడు, నిర్వికారుడు, అనుపముడు, సర్వాధారుడు, సర్వేశ్వరుడు, సర్వవ్యాపకుడు, సర్వాన్తర్యామి, అజరుడు, అమరుడు, అభయుడు, నిత్యుడు, పవిత్రుడు, సృష్టికర్తయు నై యున్నాడు. అతనినే యుపాసింపవలయును.

ఇందు రెండు విషయములు వర్ణింపబడి యున్నవి. మొదటిది పరమేశ్వరుని స్వరూపము. ఈశ్వరుడు సచ్చిదానంద స్వరూపుడు. సర్వశక్తిమత్త్వము, న్యాయకారిత, దయ మున్నగు గుణములు కలవాడగుటచే 'సగుణుడు'. జన్మవినాశములు ఆద్యంతములు వికారము మున్నగు గుణరాహిత్యముచే నిర్గుణుడునై యున్నాడు. రెండవవిషయ మేమన పైన వర్ణించిన సగుణ నిర్గుణాది స్వరూపములుగల పరమేశ్వరుడే ప్రాణుల కుపాసింపదగినవాడు. ఈశ్వరుని విడిచి యన్యుల నుపాసింప రాదని తాత్పర్యము. సర్వశక్తిమంతు డనగా నీశ్వరుడు సృష్టి నియమానుకూలముగా తన యపారశక్తులను ప్రయోగింప గలడని భావము. అన్యాయము చేయుటగాని నియమవిరుద్ధముగా నాచరించుటగాని సర్వశక్తిమత్తత గాదని తాత్పర్యము

3 వేదము సత్యవిద్యల గ్రంథము. దీని యధ్యయనాధ్యాపనములు, శ్రవణ శ్రావణములు నార్యుల కందరికి పరమధర్మము.

సత్యవిద్య కాదిమూలము పరమేశ్వరు డని ప్రథమ నియమమున జెప్పబడినది. ఇందు వేదము సత్యవిద్యల గ్రంథమని వర్ణింపబడినది. వేద మీశ్వరునిచే బ్రకాశింప జేయబడి సత్యవిద్యల కాకరమగుటచేత నద్దాని శ్రవణము నధ్యయనము నార్యులకు ధర్మమేకాక పరమధర్మమని యెరుంగవలయును.

౪ సత్యమును గ్రహించుటకును, అసత్యమును త్యజించుటకును నెల్లపుడు సిద్ధముగా నుండవలెను.

ప్రపంచమున గల యితర సమాజము లన్నిటికంటె ఆర్యసమాజమునగల విశేషమును నీ నియమము స్పష్టపఱచుచున్నది. ఆర్యసమాజ ప్రవర్తకులకు సత్యమునందుగల గాఢానురాగ మిందు ప్రకటమగుచున్నది. ఉపనిషత్తులలో నీశ్వరుడు సత్యప్రతిష్ఠుడని వర్ణింపబడియున్నది. అందువలన నీ నియమమున సత్యమును గ్రహించుట, సత్యాచరణ మొనర్చుట అసత్యమును త్యజించుట యుపదేశింపబడినవి. ఇదియే ఈశ్వరుని ప్రాప్తించుమార్గము.

౫ సర్వకార్యములను ధర్మానుసారముగా ననగా సత్యాసత్యములను విచారించి చేయవలెను.

ఈ నియమము కార్యకర్తకు స్వయముగా తన కార్యమును విచారింప నుద్దేశించుచున్నది. కార్యము నాచరించుటకు పూర్వ మది ధర్మకార్యముగను అసత్యాంశము లేనిదిగను విచారింపవలయును. ధర్మమనగా సత్యమని యిందు వివరింపబడినది. వైదిక సాహిత్యమున ధర్మసత్యశబ్దములు పర్యాయములుగా వాడబడియున్నవి. బృహదారణ్యకోపనిషత్తున నొకచో "యో వై ధర్మః సత్యం వై తత్ తస్మాత్ సత్యంవదం తమాహు ర్ధర్మం వద తీతి, ధర్మంవా వదంతం సత్యం వదతీతి" ధర్మమే సత్యము. అందువలన సత్యము చెప్పువానిని ధర్మము చెప్పుచున్నాడనియు ధర్మమును చెప్పువానిని సత్యము చెప్పుచున్నాడనియు' నని వర్ణింపబడియున్నది. ఈ నియమము ననుసరించి యంధవిశ్వాసముతో గ్రుడ్డితనముగా నొకని ననుసరింపరాదని తెలియుచున్నది. అంధపరంపర లోకమున సత్యమును దూర మొనర్చినది.

౬ ప్రపంచమున కుపకారము జేయుట యీ సమాజమునకు ముఖ్యోద్దేశము. అనగా శారీరికోన్నతి, ఆత్మికోన్నతి, సామాజికోన్నతి గలిగించుట.

ఈ నియమము రెండు విషయములను ప్రకటించుచున్నది. మొదటి విషయము ఆర్యసమాజముచేత ప్రచారము చేయబడు వైదిక ధర్మ మొకానొక దేశమునకో జాతికో సంబంధించినది కాక ప్రపంచమున కంతటికి సంబంధించి

యున్నది. ఋగ్వేదమున నిట్లే వర్ణింపబడియున్నది. " ఇంద్రం వర్ధంతో౽ప్తురః కృణ్వన్తో విశ్వమార్యమ్, అపఘ్నన్తో అరావ్ణః" దుర్గుణములను నశింపజేసి యైశ్వర్యమును వృద్ధిపరచుచు సమస్త ప్రపంచమును ఆర్య మొనర్పుము. ఋ. ౯-౬౩. ౫.

రెండవ విషయము: శారీరిక - ఆత్మిక - సామాజిక ఉన్నతుల నొనర్చుచు ప్రతిమనుష్యుడును వ్యక్తిని సమాజమును సంస్కరింప యత్నింపవలయును.

౭ అందరితో ప్రేమపూర్వకముగా ధర్మము ననుసరించి యథోచితవ్యవహార మొనర్పవలయును.

ఈ నియమము సామాజిక వ్యవహార మర్యాదను నియమించుచున్నది. ఏ పురుషు డెట్టి వ్యవహారమునకు యోగ్యుడో అతనితో నట్టి వ్యవహార మొనర్పవలయును. కాని ప్రతివ్యవహారమును ప్రీతియుక్తమై యుండవలయును.

౮ అవిద్యను నశింపజేసి విద్యను పెంపొందింపజేయవలెను. అజ్ఞానరూప నిర్బలతను తొలగించి జ్ఞానబలము నొసంగి ప్రపంచమున గల మానవులను బలవంతుల నొనర్పవలయు నని యీ నియమాశయము.

౯ ప్రతివ్యక్తియు తన యున్నతితోనే సంతుష్టుడు కాక యందరి యున్నతిలో తన యున్నతి నెరుంగవలయును.

ప్రపంచమున నన్ని చెడుగులకు మూలము స్వార్థము. అందువలన దానిని విడిచి యన్యులయున్నతిని గోరుచు తన

యున్నతికై యత్నించుచో ప్రపంచమున శాంతి నెలకొనును నని దీని భావము.

౧౦ సర్వజనహితకరము లగు సామాజిక నియమములను పాలించుటలో పరతంత్రులై వ్యక్తిహితకరము లగు నియమములందు స్వతంత్రు లగుట అందరికి తగును.

వ్యక్తి, సమాజము నను నీ రెంటివిషయమున మనుష్యు నెట్లు వర్తించవలయునో యీ నియమము బోధించుచున్నది. వ్యక్తికి మాత్రము హితవు గలిగించు కార్యములలో ప్రతి మానవ వ్యక్తియు సంపూర్ణ స్వతంత్రత గలిగియుండును. కాని సమాజమునకో మానవమాత్రునకో హితము గలిగించు కార్యములందు ప్రతివ్యక్తియు సమాజనియమములకు బద్ధుడు కావలసియుండును. అట్లాచరించినపక్షమున వ్యక్తికి సమాజమునకు శుభము కలుగగలదు.

ప్రపంచమున జన్మించు ప్రతిమానవుడు మూడువిధము లగు కర్తవ్యములను నిర్వర్తింపవలసియుండును. ౧. తనకొఱకు చేయవలసిన కర్తవ్యము. (౨) అన్యులకొఱకు చేయవలసిన కర్తవ్యము. (3) పరమేశ్వరునితో తనకు గల కర్తవ్యము. ఆర్యసమాజమునకు సంబంధించిన పై పదినియమములు నీత్రివిధ కర్తవ్యములను విశదపరుచుచున్నవి. మొదటి యొకటి రెండు నియమములందు పరమేశ్వరుని విషయమున మనుష్య కర్తవ్యములు నిర్దేశింపబడినవి. పరమేశ్వరుడు జగత్కర్త యనియు,

వేదప్రకాశకుడనియు విశ్వసించి యతనినే యుపాసించుట మానవులకు కర్తవ్యమని యెరుంగవలయును.

మూడు, నాలుగు, ఐదు నియమములు మనుష్యుడు తన విషయమున నొనరింపదగు కర్తవ్యములను తెలుపుచున్నవి. అవి యెవ్వి యన:-

౧ వేదములను చదువుట, చదివించుట, వినుట, వినిపించుట.

౨ అసత్యమును విడచి సత్యమును స్వీకరించుట.

౩ ప్రతి కార్యమును సత్యాసత్యములను విచారించి చేయుట.

మిగిలిన అయిదు నియమములు అన్యుల విషయమున మనుష్యునకు చేయతగిన కర్తవ్యములను బోధించుచున్నవి. ఆ కర్తవ్యములు నాలుగువిధములు:

౧ మానవుల శారీరిక, ఆత్మిక, సామాజిక ఉన్నతులకై ప్రతివ్యక్తియు కార్యతత్పరుడు కావలసియుండును.

౨ విద్యను విస్తరింప జేయవలయును.

౩ తన యున్నతితోబాటు ఇతరుల యున్నతికై విచారించవలయును.

౪ సమాజ నియమములకు బద్ధుడు కావలయును.

ఆర్యసమాజ నియమములు లెక్కకు పదియైనప్పటికి వానిలో మానవ సమాజోన్నతికి కావలసిన సామగ్రి యంతయు నిండియున్నదని చెప్పుట కెట్టి సందియమును లేదు.

## ఆర్యసమాజ మంతవ్యములు :

౧ త్రైత సిద్ధాన్తము

ఋగ్వేదమున ప్రథమమండలములో నొక మంత్రము త్రైతవాదమును ప్రతిపాదించుచున్నది.

"ద్వాసుపర్ణా సయుజాసఖాయా సమానం వృక్షంపరిషస్వజాతే తయో రన్యః పిప్పలం స్వాద్వత్త్యనశ్నన్నన్యోఽభిచాకశీతి॥

ఋ. ౧-౧౬౬-౨౦

"ఒక వృక్షముమీద సుందర పర్ణములు గలిగి సమాన గుణములు గల మిత్రభావముతో నొప్పు రెండు పక్షులు కూర్చుండి యున్నవి. వానిలో నొకటి వృక్షముయొక్క ఫలముల నాస్వాదించుచున్నది. రెండవది సాక్షిరూపమున నిరీక్షించుచున్నది." అని మంత్రార్థము. ప్రపంచ రూపవృక్షమున ఆత్మ పరమాత్మనామకము లగు రెండు పక్షు లున్నవి. అందు జీవాత్ముడు ప్రాకృతిక సత్వరజస్తమో గుణములద్వారా ప్రేరితుడై కర్మల నొనరించుచు తదనుకూలముగా కష్టసుఖముల ననుభవించుచున్నాడు. పరమాత్ముడు కర్మఫలభోగములతో సంబంధము లేక కేవలము ద్రష్టయై యున్నాడని దీనిభావము.

"త్రయః కేశినః ఋతుధా విచక్షతే సంవత్సరే వపతఏకఏషామ్ విశ్వమేకో అభిచష్టే శచీభిర్ధ్రాజిరే కస్యదదృశేనరూపమ్.

ఋ ౧-౧౬౪-౪౪.

ప్రకాశమయములగు మూడు పదార్థములు నియమానుసారముగా వివిధములగు కార్యములు చేయుచున్నవి. వీనిలో నొకటి సృష్టిసమయమున వాసయోగ్యమగు ప్రపంచ బీజమును విత్తుచున్నది. రెండవది తనకర్మల ననుసరించి మంచిచెడుగు ఫలముల ననుభవించుచున్నది. మూడవది గతిని అనగా కార్యమును ప్రదర్శించుచున్నది. కాని దీనికారణరూపము సూక్ష్మమగుటచే నగోచరమై యున్నదని మంత్రతాత్పర్యము. ఇందు మొదటిపదార్థము కర్మఫలదాత, పరమేశ్వరుడు; రెండవది కర్మఫలముల ననుభవించు జీవాత్ముడు; మూడవది కర్మభూమియగు ప్రకృతి యని తాత్పర్యము. ఇట్లు జీవేశ్వరప్రకృతులు మూడు ననాదిసిద్ధములు. విచారదృష్టితో తిలకించినను దృష్టిగోచరమగు నీప్రపంచ మిట్లేర్పడ వలయునన్న నుపర్యుక్త పదార్థత్రయమును ననాదిసిద్ధమై యుండుట యనివార్య మని తోచకమానదు. ప్రకృతిజీవాత్మలు సామాన్యముగా ననుభవసిద్ధములే. జీవాత్మ ప్రకృతులను మేలవించి జగత్తును రచించు పదార్థమొండు, పరమాత్మ నామకమును, స్వీకరింపక తప్పదని విద్వాంసు లూహింపగలరనియే నమ్ముచున్నాడ

౨. ఏక దేవపూజ—

పరమేశ్వరునందుగల నానావిధ గుణముల ననుసరించి యత డనేక నామముల పేరొ-నబడుచున్నాడు. కాని యవి వేరు లతనిభిన్నభిన్న నామములతో భిన్నభిన్న సంప్రదాయ

ముల నేర్పరచిరి. ఈ సంప్రదాయముల ననుసరించువారు పర స్పర మభీష్టదేవుని నిందించుటలోను వెనుకాడరు. కాని యా ర్యసమాజప్రవర్తకు డగు మహర్షి దయానందుడు వేదముల నాధారముగా గొని యుపాస్యదేవు డొక్కడే యనియు నత డనేక నామములతో విద్వాంసులద్వారా పేర్కొనబడెననియు నిశ్చయించెను.

"ఇంద్రం మిత్రం వరుణ మగ్ని మాహు
రథో దివ్యః స సుపర్ణో గరుత్మాన్
ఏకం స ద్విప్రా బహుధా వద
న్త్యగ్నిం యమం మాతరిశ్వాన మాహుః.

ఋ. ౧-౧౬౪-౪౬.

"త దేవాగ్ని స్తదాదిత్య స్త ద్వాయు స్తదు చంద్రమాః
తదేవ శుక్రం తద్బ్రహ్మ తా ఆపః స ప్రజాపతిః

యజు. ౩౨-౧.

ఈ మంత్రములందుగల ఇంద్ర, మిత్ర, అగ్ని, సుపర్ణ, ఆదిత్య చంద్రాదిశబ్దము లన్నియు నీశ్వరునినామము లనియు, నామ ములుగలవా డొక్కడే పరమేశ్వరు డనియు స్పష్ట మగుచున్నది.

3 అవతారవాదము:—

ఈశ్వరుడు వేదములందు నుపనిషత్తులందును హస్త పాదాది శరీరరహితు డనియు జన్మజరాదులు లేనివా డనియు వర్ణింపబడియున్నాడు.

"స పర్యగా చ్ఛుక్ర మకాయ మవ్రణ
మస్నావిరగ్ం శుద్ధ మపాపవిద్ధమ్
కవి ర్మనీషీ పరిభూః స్వయంభూ ర్యాథాతథ్యతోZ
ర్థాన్ వ్యదధా చ్ఛాశ్వతీభ్యః సమాభ్యః

యజు. ౪౦ అ

"అపాణిపాదో జవనో గ్రహీతా
పశ్య త్యచక్షుః స శ్రుణో త్యకర్ణః
స వేత్తి వేద్యం నచ తస్యా స్తి వేత్తా
త మాహు రగ్ర్యం పురుషం మహా న్త మ్"

కఠోపనిషత్తు.

ఈశ్వరుడు ప్రపంచనిర్మాత యయినను జన్మ శరీరాదులు లేనివాడనియే దీని తాత్పర్యము. అతనికి శరీర సంబంధ మేర్పడ వీలు లేదు. శరీరము ప్రకృతివికారము. ఈశ్వరునకు ప్రకృతి బంధమున బడవలసిన యవసర మేమి? శరీరధారణ నొనర్చిన చేతనమునందు పరిమితి యేర్పడును. అట్టి చేతనము చే జ్ఞాన కర్మేంద్రియములద్వారా చేయబడిన కర్మలలో పరిమితి యేర్పడును. అందువలన సంపూర్ణ బ్రహ్మాండమును రచించు విభుస్వరూపుడగు పరమేశ్వరుడు స్థూలపార్థివ శరీరము ను ధరింపజాలడు. పౌరాణికులచే వర్ణింపబడు దశావతారములు పరమేశ్వరునకు సంబంధించిన వనుట భ్రాంతిపూర్ణము, యుక్తివిరుద్ధము. ఉపనిషదాదులందు వర్ణింపబడిన సచ్చిదా

నంద స్వరూపుడగు పరమేశ్వరుడు గర్భప్రసవాది యాతనల ననుభవించుటయు, రాగద్వేషాదిదోషయుక్తు డగుటయు వివిధ ధర్మాధర్మ కర్మల నాచరించుటయు దార్శనిక దృష్టి కెంతయు విరుద్ధము లగుటయేగాక వేదవిరుద్ధమని సుస్పష్టమే. పురాణాదులందు రాక్షసాది పదార్థ మీశ్వరున కవతారములు కల్పించుట ఈశ్వరుని సర్వశక్తిమత్తతలో గల గౌరవమును తగ్గించుటయేగాని పెంచుట కానేరదు. రావణాదుల సృష్టించుటకు శరీరధారణ మవసరము కానపుడు సంహరించుట కేల యవసర మగును? వస్తునిర్మాణమునకంటె సంహారమునకు సామర్థ్యాతిశయ మవసరమా?

౪ మూర్తిపూజ:-

వర్తమానకాలమున ననేక స్థలములలో నానావిధములగు దేవీ దేవతల మూర్తులు ప్రతిష్ఠింపబడియున్నవి. అనుదిన మవి యభిషేకాదులచే శుద్ధము చేయబడుచున్నవి. వస్త్రాభరణాదులచే నలంకరింపబడి అన్నపాన వివాహాదులతో సంతోషపెట్టబడుచున్నవి. ఈ యాచారము లన్నియు నార్యసమాజ దృష్టిలో నశాస్త్రీయములు. యజుర్వేదమున నొకచో

"న తస్య ప్రతిమా అస్తి యస్య నామ మహ ద్యశః".

మహాయశస్సంపన్నుడగు నా పరమేశ్వరునకు ప్రతిమ (విశేష పరిచాయక చిహ్నము) లేదని స్పష్టముగా వర్ణింపబడియున్నది. ఈశ్వరునకు విగ్రహాదులను కల్పించుట యుక్తి

సంగతము కానేరదు. ఏకదేశి వస్తువునకు మూర్తి యుండ వచ్చును. విభుపదార్థమున కాకార మెట్లేర్పడగలదు? మూర్తి పూజను సమర్థించు మహాశయులు కొందరు "సర్వవ్యాపకుడగు పరమాత్ముడు మూర్తియందు లేడా?" అని ప్రశ్నింతురు. మూర్తియందు పరమేశ్వరు డుండును. కాని మూర్తి పరమేశ్వరుడు కాదుగదా! మూర్తి నీశ్వరుడని యెంచి చేయు పూజాది కృత్యములకు, అన్నవస్త్రాదుల నర్పించు చేష్టలకు నర్థ మేమి? "అణోరణీయాన్ మహతో మహీయాన్" స్వరూపుడగు పరమేశ్వరు నుపాసింపవలయునన్న చిత్తవృత్తి నిరోధ ఫలక యోగాంగముల ననుష్ఠింపవలయును. అనంతరము నిర్మల బుద్ధి సహాయమున తన హృదయమందిరమున పరమేశ్వరుని యనుభూతి కలుగును.

౫. కర్మఫలము—

జీవాత్మ కర్మ నొనరించుటలో స్వతంత్రుడును ఫలము ననుభవించుటలో పరతంత్రుడునై యున్నాడు. అత డొనరించు కర్మల కనుకూలముగా పరమాత్ముడు ఫలముల నిచ్చుచుండును. పరమాత్ముడు జీవు లొనరించు పాపములను క్షమింపడు. జీవ మున్నంత వఱకు కర్మల నాచరించుట వేద సమ్మతము. "కుర్వన్నేవేహ కర్మాణి జిజీవిషే చ్ఛతగ్ం సమాః" కర్మల నాచరించుటలో ఫలాపేక్షను విడిచిన నిష్కామకర్మ లనబడును. నిష్కామకర్మ బంధన హేతువు

కానేరదు. అది శ్రేయస్కర మగును. పై వేదవాక్యమున 'కుర్వ న్నేవ' అను పద మకర్మను నిషేధించుచున్నది. గీతయందును "మా కర్మ ఫలహేతుర్భూః మా తే సంగోఽస్త్వకర్మణి" అని శ్రీకృష్ణుడు నుడివియున్నాడు.

౬ పూర్వోత్తర జన్మలు—

జీవాత్ముడు తా జేయుశుభాశుభకర్మల ననుసరించి నానావిధ యోనులలో ప్రవేశించుచుండును. ముక్తి పర్యంత మాత్మకు పలుజన్మల నెత్తవలసియుండును "అజో నిత్యః శాశ్వతోయం పురాణో, న హన్యతే హన్యమానే శరీరే" ఆత్మ నిత్యము శరీరము నశించిన, ఆత్మ నశింపనేరదు; ఒకశరీరము నశించిన మరియొక శరీరమును ధరించును. గీతయందు నిట్లే వర్ణింపబడియున్నది. "వాసాంసి జీర్ణాని యథా విహాయ నవాని గృహ్ణాతి నరోఽపరాణి" జీర్ణవస్త్రములను విడిచి నవీనవస్త్రముల ధరించినట్లు జీర్ణశరీరములను విడిచి నవీన శరీరములను ధరించును. పునర్జన్మ సిద్ధాంతము నంగీకరింపకున్న ప్రపంచమునగల విషమతను పరిష్కరించుట దుష్కర్మమేగాక యసంభవ మగును. ప్రస్తుతమున పూర్వజన్మ వృత్తాంతములను వినిపించిన బాలబాలికలు పలువురు లభించియుండుట సర్వజనవిదితమే.

౭ ముక్తి - దాని సాధనములు—

శాస్త్రములందు మనుష్య జీవనోద్దేశము ముక్తి యని

వర్ణింపబడియున్నది. దుఃఖములనుండి విముక్తుడగుటయే ముక్తి యనబడును. మనుష్యుడు జ్ఞానపూర్వకముగా శాస్త్రనిర్దిష్ట సదాచారముల ననుష్ఠించుచు, అభ్యాస వైరాగ్యముల ద్వారా కర్మలను దగ్ధబీజములవలె నొనరించి ముక్తిని ప్రాపించును. ముక్తావస్థయందు జీవాత్మకు ప్రకృతితో సంబంధ ముండదు. ఈశ్వరునియందానందము ననుభవించుచుండును. ఆర్యసమాజము ముక్తి సాంత మని యెంచును. ముక్తజీవులు పరాంత కాలమున మరల జన్మింతురు "పరాంతకాలేపరిముచ్యన్తిసర్వే"

౮ స్వర్గ నరకలోకములు—

సుఖదుఃఖముల ననుభవింపదగు యోనివిశేషములే స్వర్గనరకము లని యార్యసమాజ మెంచును. పౌరాణికులు చెప్పునట్లు స్వర్గనరకములు స్థానవిశేషమున నుండు లోకములు కానేరవు.

౯ శ్రాద్ధము

మనుష్యుడు మరణించినపుడు పార్థివ శరీర మగ్నియందు దగ్ధము చేయబడును. ఇట్లు చేయుట వైదికసిద్ధాంతానుకూలమే " భస్మాన్తగ్ం శరీరమ్" అని వేదమున నుదహరింపబడినది. ప్రపంచమునగల మతములలో నెక్కువభాగము శరీరమున శరీరముకంటె భిన్నముగా చేతన మను నొక పదార్థ ముండునని నిశ్చయించుచున్నవి. మరణ మనగా నాచేతనవస్తువు శరీరమును విడుచుటయని యర్థము. ఆచేతనపదార్థమే వేదాది

శాస్త్రములందు జీవాత్మ యనబడుచున్నది. జీవాత్మ శరీరమును విడిచిపోవునపుడు, సూక్ష్మశరీర మతనివెంట పోవును. సూక్ష్మ శరీర మనగా పంచతన్మాత్రలు పంచప్రాణములు అంతఃకరణము మున్నగు సూక్ష్మ పదార్థముల సముదాయమని యర్థము. జీవాత్మ యొక శరీరమును విడిచి తన కర్మల ననుసరించి మరి యొక శరీరమున ప్రవేశించును. ఇదియే మరల జన్మించుట. ప్రస్తుతము హిందువులలో చాలమంది మరణానంతర మా మరణించినవ్యక్తి నుద్దేశించి మృతకశ్రాద్ధమను పేరుతో కొన్ని క్రియల నొనరింతురు. గయా ప్రయాగాది స్థలములకు పోయి యట మృతవ్యక్తుల నుద్దేశించి పిండదానముల నొనరించి యట్లు చేయుటవలన వారికి సద్గతి కలుగు ననియు నెంతురు. కాని వేదములందు పలుచోట్ల మరణానంతరమున పూర్వ సంసార ముతో నతని కెట్టి సంబంధము నుండదని స్పష్టముగా వర్ణింపబడి యుండుటను జూచుచున్నాము. ఈ భౌతిక దేహసంబంధము విడిపోయిన తరువాత మంత్రాదులతో నతని నాహ్వానించుట, భోజనాదులచే తృప్తిపరుచుట మున్నగు క్రియలు, విశ్వాసములు నన్నియు నాత్మవంచనతప్ప మరియొండు విశేషము కానరాదు. జీవుడు తన కర్మఫలముల నన్నిటిని భోగము ద్వారా నశింపజేయునేని మోక్షసుఖము ననుభవించును. కర్మ ఫలము లవశిష్టములైయున్న వాని ననుభవింపదగుజన్మల నెత్తుచుండును. ఈ రెండువిధములైన పరిస్థితులందును మృతక

శ్రాద్ధాది క్రియలు నిరర్థకములే. శరీరాంతమున సుఖదుఃఖ ములననుభవించుచు "పితరః అత్ర ఆగచ్ఛన్తు" అని శ్రాద్ధ తర్పణాది సమయములందు మన మాహ్వానించుట నిరర్థకము గాక మరేమగును!

అందువలననే దయానందమహర్షి సత్యార్థప్రకాశమున చతుర్థ సముల్లాసమునందు శాస్త్రప్రమాణముల ననుసరించి శ్రాద్ధశబ్దము నిట్లు వివరించియున్నాడు. జీవితు లయియున్న తల్లిదండ్రులు తాతముత్తాతలు మఱియు నన్యవృద్ధ సజ్జనులు మున్నగువారి కతిశ్రద్ధతో నన్నవస్త్రాదులద్వారా సేవనొనరించి వారియాత్మలు తృప్తు లగునట్లును శరీరము స్వస్థమగునట్లును యత్నించుటయే శ్రాద్ధము, తర్పణము ననబడును. "శ్రత్ సత్యం దధతీతి శ్రద్ధా, శ్రద్ధయా దీయతే క్రియతేవా యత్క-ర్మ తత్ శ్రాద్ధమ్" సత్యధారణ చేయునది శ్రద్ధ, శ్రద్ధతో నొనరించు కర్మ శ్రాద్ధ మనబడును.

తల్లిదండ్రులు, గురువు, ఆపత్తినుండి రక్షించువారు, పాలించువారు,ఉపనయన మొనర్చువారును పితరులనబడుదురు. వీరికి శ్రద్ధతో నన్నజలాదుల నొసంగి సేవించుటయే శ్రాద్ధ మనబడును. మృతకశ్రాద్ధాదులు సర్వవిధముల నవైదికము లను టలో నెట్టి సంశయము లేదు.

శాస్త్రమున "కుర్యాదహరహః శ్రాద్ధమ్"అనియున్నది. ప్రతిదినము వృద్ధులగు మాతాపితరులు మున్నగువారిని భోజ

నాదులచే సత్కరించవలయునని దీనియర్థము. ఇది జీవత్ పితరుల కనుట సంగత మగును. కాని మృతుల నుద్దేశించి చేయు క్రియ లన్నియు బూడిదలో నాహుతులు వేయు టగును.

౧౦ యజ్ఞము - షోడశసంస్కారములు.—

దయానందునకు పూర్వము భారతమున యజ్ఞములతివికృతరూపమును ధరించియుండెను. వానిలో పశువులు హింసింపబడుచుండెడివి. నేడు నిట్టి యమానుష కృత్యము లక్కడక్కడ గోచరింపకపోవు. దయానంద మహర్షి యిట్టి యజ్ఞములు వేదవిహితములు గావనియు యజ్ఞము లనగా హింసలకు తావీయని సత్కార్యము లనియు బోధించెను. దేవపూజలు (విద్వాంసుల సత్కారములు) సంగతి కరణము (విద్వాంసులసంగతి - ప్రాకృతిక శక్తుల ప్రదర్శనము - విజ్ఞానమునకు శిల్పశాస్త్రమునకు సంబంధించిన ప్రదర్శనములు) దానాదులచే పరోపకార మొనర్చుట మున్నగు సత్కార్యములే యజ్ఞములని మహర్షి నిర్వచించియున్నాడు. వేదములలో యజ్ఞమునకు పర్యాయముగా అధ్వరశబ్దము చాలమాఱులు వాడబడి యున్నది. అధ్వర మనగా హింస లేనిదని యర్థము.

పంచమహాయజ్ఞములు ప్రతిగృహస్థున కవశ్యము ప్రతిదిన మాచరించదగినకర్మ లయి యున్నవి. అవి యెవ్వి యనగా ౧. బ్రహ్మయజ్ఞము = సంధ్యావందనము ౨. దేవయజ్ఞము = అగ్నిహోత్రములు 3. అతిథియజ్ఞము =ఉత్తమ సంన్యాసులకు

విద్వజ్జనుల కన్నమిడి సత్కరించుట ౪. బలివైశ్వదేవము = కుక్క మున్నగు గృహజంతువులకు వికలాంగులకు నిరుపేదలకు నన్న మొసంగుట ౫. పితృయజ్ఞము = తల్లిదండ్రులను వృద్ధులను సేవించుట.

ప్రతి మనుజుడును శరీరమునకు సంబంధించిన షోడశ సంస్కారములను సరిగా నుచితసమయముల నాచరించుచుండవలయును. ఆ సంస్కారముల నామముల నిట పొందు పరుచుచున్నాము. విశేషవిధులు సంస్కారవిధియందు జూడదగును. ౧. గర్భాధానము ౨. పుంసవనము ౩. సీమంతోన్నయనము ౪. జాతకర్మము ౫. నామకరణము ౬. నిష్క్రమణము ౭. అన్నప్రాశనము ౮. ముండనము ౯. కర్ణవేధము = (చెవులుకుట్టుట) ౧౦. ఉపనయనము ౧౧. వేదారంభము ౧౨. సమావర్తనము ౧౩. వివాహము ౧౪. వానప్రస్థము ౧౫. సంన్యాసము ౧౬. అన్త్యేష్టి(=దహన సంస్కారము) నేడు హిందువులలో నీ సంస్కారములు చాలవరకు లోపించిన వనుటలో సంశయము లేదు. వీనిలో నే రెండుమూడు సంస్కారములాచరణమున నున్నవో అవియు వికృతరూపమును బొంది యున్నవి, అవైదికపద్ధతులతో నిండియున్నవి. దయానందుడు వీని పరిష్కృతరూపమును విశదపరచి పునరుద్ధరింప ప్రబల ప్రయత్న మొనర్చెను. ఇందుకు 'సంస్కారవిధి' నామక పుస్తక మొకటి వేరుగా రచించియున్నాడు.

౧౧ భూతప్రేతములు

హిందువులలో ననేకులు తమకు గలుగు నాపత్తులకు మూలము భూతప్రేతములని భావించి నానావిధ కుతంత్రముల నాచరించుచుందురు. యథార్థమున భూతప్రేతముల విశ్వాసము భ్రామకము. ఇవి వంచకులచే నజ్ఞానులచే కల్పింపబడిన మిథ్యావిశ్వాసములు. గ్రహచారము ననుసరించి మనుజులకు కష్టనష్టములు కలుగుటయు, శాంతిదానాదులచే నుపశమించుటయు నసత్యములే. ఉదరపోషకులచే కల్పింపబడిన గ్రంథములిందుకు మూలములుగాని వేదాది సచ్ఛాస్త్రములం దిట్టి విచారములకు తావు కానరాదు. గతమునకు భూత మనియు వెళ్ళిపోవుటకు ప్రేత మనియు నర్థము.

౧౨ వర్ణ వ్యవస్థ—

"బ్రాహ్మణోఽస్య ముఖ మాసీద్,
బాహూ రాజన్యః కృతః
ఊరూ తదస్య యద్వైశ్యః
పద్భ్యాగ్ం శూద్రోఽజాయత"

ఇది యజుర్వేదమున పురుషసూక్తగతమంత్రము. ఇందు మానవజాతి పురుషాకృతితో బోల్చి వర్ణింపబడినది. మనుష్య సమాజరూప శరీరమున ముఖస్థానీయుడు బ్రాహ్మణుడు, బాహుస్థానీయుడు క్షత్రియుడు, ఊరుస్థానీయుడు వైశ్యుడు, పాదస్థానీయుడు శూద్రుడునని వర్ణింపబడి యున్నది. కల్పన

యెంతయు సుందరము. శరీరమున ముఖము, జ్ఞానమునకు విచారమునకు నావశ్యక పదార్థములతో నేర్పడియున్నది. అట్లే మానవ సమాజమున జ్ఞానవిచారానుకూల మగు పఠన పాఠనాది కృత్యముల నొనరించువారు బ్రాహ్మణ శబ్దముచే వ్యవహరింపబడ వలయును. ఇట్లే సమాజమును శత్రుబాధనుండి రక్షించువారు క్షత్రియు లనియు, ఊరువుల యాధారమున శరీరము సుస్థిరమై యుండునట్లు కృషి మున్నగు వ్యాపారముల వలన ధనాదుల సంగ్రహించి సమాజమును పోషించువారు వైశ్యు లనియు, శరీరమున కాధారభూతములయి సంచారాది కార్యములం దుపయోగించు పాదముల బోలి సమాజమున కావశ్యకమైన శారీరకపరిశ్రమలచే నుపకరించువారు శూద్రు లనియు వ్యవహరింపబడవలయు నని వేద మాదేశించుచున్నది. ఇట్లు శాస్త్రములందు గుణకర్మల ననుసరించి మనుజులు చతుర్విధముల వ్యవహరింపబడు టుచితమని వర్ణింపబడియున్నది. మనుస్మృతియం దొకచో

"బ్రాహ్మణాః క్షత్రియాః వైశ్యా స్త్రయో వర్ణా ద్విజాతయః
చతుర్థ ఏకజాతిస్తు శూద్రో నాస్తి తు పంచమః

బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులను నాలుగు వర్ణములు తప్ప అన్యవర్ణములచే పేర్కొనదగినవారు లేరని వ్రాయబడియున్నది. ఇట్లు శాస్త్రము నైదవవిభాగమునే నిషేధించుచుండ నేడు హిందువులలో వేలకొలది విభాగములలో

మనుజులు విభజింపబడి పరస్పర ప్రేమకు దూరులగుచున్నారు. "వైదికవర్ణ వ్యవస్థ లోపించి నానావిధముల విభజింపబడుటచే నార్యజాతి దినదినము నశించుచున్నది." అని దయానంద మహర్షి వక్కాణించియున్నాడు.

వర్ణవ్యవస్థ విషయమున ఆర్యసమాజ సిద్ధాంతమునకును తదితర హిందువుల సిద్ధాంతమునకును చాల భేద మున్నది. ఇతర హిందువులు కుల గోత్రముల ననుసరించి వర్ణముల నొప్పుకొందురు. బ్రాహ్మణ నామధారి గృహమున బుట్టినవా రెల్లరు బ్రాహ్మణులే. ఇట్లే వైశ్యాదులు. ఆర్యసమాజపు దృష్టిలో ఇట్టి వ్యవస్థ వేదసమ్మతము కాదు. గుణకర్మ స్వభావములే వర్ణవ్యవస్థాపకములని సమాజనిశ్చయము.

మహాభారత వనపర్వమునందు నహుషుడు యుధిష్ఠిరుని

"జాత్యా కులేన వృత్తేన స్వాధ్యాయేన శ్రుతేన వా
బ్రాహ్మణః కేన భవతి తద్బ్రూహ్యత ద్వినిశ్చితమ్"

జాతి, కుల, వృత్త, స్వాధ్యాయాదులలో దేనిచేత బ్రాహ్మణుడు కాగలడో నిశ్చయముగా తెలుపుమని ప్రశ్నించెను. అందులకు యుధిష్ఠిరు డిట్లు ప్రత్యుత్తర మిచ్చెను.

"న జాతి ర్న కులం తాత న స్వాధ్యాయః శ్రుతం నచ
కారణాని ద్విజత్వస్య వృత్త మేతస్య కారణమ్"

జాతి కులాదు లేవియు ద్విజత్వమునకు కారణములు కావు. వృత్తము (=నడవడి) యొక్కటే కారణము అని దీని

భావము. ఇట్లు పురాణములందు నక్కడక్కడ వైదిక సిద్ధాన్తము ననుసరించు విచారములు లభింపగలవు. ప్రస్తుతమున చండాల శబ్దముచే పిలువబడు కులమున నుత్పన్ను డయ్యు సదాచారముతో జీవనము గడుపువాడు బ్రాహ్మణశబ్దముచే పిలువబడగలడని మహాభారత వచనము స్పష్టపరుచుచున్నది. మనుస్మృతి కర్తయు "జన్మనా జాయతే శూద్రః సంస్కారైర్ద్విజ ఉచ్యతే" జన్మమువలన శూద్రు డయినవాడు సంస్కారములద్వారా ద్విజు డగునని స్పష్టముగా శాసించుచున్నాడు. యథార్థమున ప్రతి మనుజుడు జన్మ సమయమున శూద్రుడే యగును. క్రమముగా గురుకులమున విద్యాభ్యాసాదుల నొనరించి స్నాతకుడై స్వగుణ కర్మస్వభావముల ననుసరించి గురువులద్వారా బ్రాహ్మణాదివ్యావహారిక శబ్దములచే భూషితుడగును. నాటనుండి యతడా వర్ణమున వ్యవహరింపబడును. భిన్నభిన్న వర్ణములందు జన్మించినట్టి యువకులు యువతీమణులును విద్యావయోశీలములందు సమానత గలిగి యున్నచో పరస్పరము వివాహములు చేసికొనవచ్చును. ఇట్టివివాహములు వర్ణసంకరములుగా నెంచబడక సవర్ణవివాహములుగా నెంచబడును. వర్ణసామ్యము గుణకర్మవిద్యాదుల సామ్యము చేతనే యేర్పడు ననుట నిస్సంశయము.

నేడు ఉన్నత వర్ణు లనబడు బ్రాహ్మణాదుల స్వార్థ క్రౌర్యాదుల వలననే హిందువులలో కోట్లకొలది భారత

సోదరులు అస్పృశ్యులుగా వ్యవహరింపబడు చున్నారు. వారిని హిందువులు ఘృణితదృష్టితో జూచుచున్నారు. హిందువులలో గల యీ దుర్వ్యవస్థవలన విధర్ములు నెంతో లాభమును పొందుచున్నారు. వారు తమ మతమును పెంపుచేయుటలో నెంతో సఫలు లగుచున్నారు. రాజనైతిక క్షేత్రములందును అస్పృశ్యులను హిందువులకు విరుద్ధముగా నిలబెట్టి హిందువుల సాంఘికశక్తియు క్షీణము చేయబడుచున్నది.

ఆర్యసమాజ్య మీ సమస్యను పరిష్కరించుటకు తగిన ప్రయత్న మొనరించినది. సమాజ సిద్ధాన్తము ననుసరించి జన్మచే నెవడు నస్పృశ్యుడుగా నెంచబడడు, చౌర్యము వ్యభిచారము మున్నగు పాపముల నొనర్చువారే యథార్థముగ నస్పృశ్యులు. మలినవస్త్రములను శుద్ధమొనర్చి శుభ్రవస్త్రములలో నుంచునట్లు అస్పృశ్యులనబడు వారిలో నున్న దోసగులను దూర మొనర్చి వారికి చాతుర్వర్ణ్యమందు స్థాన మొసంగవలయును. ఎవని నైనను యావజ్జీవము అస్పృశ్యుడని చెప్పి ఘృణిత దృష్టితో జూచుట వైదిక ధర్మమున కెంతయు విరుద్ధము. ఋగ్వేదమున:—

"అజ్యేష్ఠాసో అకనిష్ఠాసో ఏతే సంభ్రాతరో వావృధుః సౌభగాయ" పెద్దలు పిన్నలు ననియెంచక దేశధర్మముల యభివృద్ధికొరకు పరస్పరము సోదరుల వలె నెంచుడని స్పష్టముగా బోధింపబడియున్నది.

యజుర్వేదమున:—

"రుచం నో ధేహి బ్రాహ్మణేషు, రుచం రాజసు నస్కృధి
రుచం విశ్యేషు శూద్రేషు మయి రుచా రుచమ్"

అని బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులందు సమానముగా తేజస్సు సమృద్ధియు నుండవలయునను నభిప్రాయము స్పష్టపడుచున్నది.

ఇట్లే యథర్వవేదమునందును

"ప్రియం మాకృణు దేవేషు ప్రియం మాకృణు రాజసు
ప్రియం సర్వస్య పశ్యతః ఉతశూద్రే ఉతార్యే"

అను నీ మంత్రముద్వారా మనుష్యుడు బ్రాహ్మణాది శూద్రపర్యంత సమస్త మానవులకును ప్రియుడై యుండునట్లు బోధింపబడినది. ఇట్లు వేదములందెల్లయెడల ననేక మంత్రముల ద్వారా మానవులలో సమానత బోధింపబడుచుండ వైదిక శిక్షలను విడనాడి యుచ్చనీచ భావముల పెంపొందింపజేయు మానవులు వైదికు లెట్లు కాగలరు? వైదికధర్మానుయాయులు కాకపోవుటచే పాపు లెట్లు కారు?

భారతవర్షమున నేటికిని వేదాది సచ్ఛాస్త్రములను స్త్రీ శూద్రులు చదువదగ రని వాదించు బ్రాహ్మణోత్తములనబడువా రెందరో కలరు. తమ నిర్బలవాదమును బలపరచుటకై శంకరాచార్యులవంటి సాంప్రదాయ ప్రవర్తకులను

ప్రమాణముగా నుద్ధరించు మహానుభావులు నెందరో కలరు. వీరి వైదగ్ధ్యము నేమనవలెనో తోచకున్నది:

యజుర్వేదమున

"యథేమాం వాచం కల్యాణీ మావదాని జనేభ్యః
బ్రహ్మరాజన్యాభ్యాం శూద్రాయ చార్యాయచ
స్వాయ చారణాయచ"

'పరమేశ్వరు డీ కళ్యాణకరమగు పవిత్రవాణిని బ్రాహ్మణ క్షత్రియ, వైశ్య, శూద్ర, భృత్యాది సర్వజనులకొరకై యుపదేశించెను' అని స్పష్టవర్ణనలు కనబడుచుండ మానవ జాతిలో కొందరు మాత్రము తమ సొత్తని యెంచుట స్వార్థ పరతగాక మరేమగును? వైదిక ధర్మపరాయణమగు నార్య సమాజ మిట్టి యాచార విచారములు ధర్మవిరుద్ధము లనియు జాతీయతావృద్ధి నరికట్టు ననియు నెంచును.

"సమానీ ప్రపా సహవోఽన్నభాగాః
సమానే యోక్త్రే సహవో యునజ్మి
సమ్యంచోఽగ్నిం సపర్యతారానాభి మివాభితః"

ఇది యథర్వవేదమున నొకమంత్రము 'ఇందు (౧) జల పానస్థల మేకమై యుండవలయును. (౨) అందరి యన్నభాగ ములు సమానముగా నుండవలయును. (3) అందరును కలిసి పరమేశ్వరు నుపాసింపవలయును.' అని యన్నివిధముల సమాన తను వేదము లుద్ఘోషింపుచుండ నేటికిని హిందువులలో కోట్ల

కొలది మానవులు నీచులుగా నెంచబడుచు కూపాదిజలాశయముల సమీపింపకూడ దని దూరమున నుంచబడుచున్నారు. ప్రస్తుత హిందూదేవ మందిరములు వేదవిహితములు గాకున్నను హిందువులచే పరమేశ్వరపూజాస్థానము లని యెంచబడుచు నస్పృశ్యుల కందరానివిగా నున్నవి. ఈ యాచారములన్నియు నసదాచారము లని యార్యసమాజము విశ్వసించుచున్నది.

౧౩. శుద్ధి:—

భారతవర్షమున నార్యసమాజ మేర్పడుటకు పూర్వము లక్షలకొలది హిందువులు ప్రతి సంవత్సరమునను క్రైస్తవ మహమ్మదీయ మతములను గ్రహించి వారిలో కలుపబడుచుండిరి. మహమ్మదీయుల కురాను వాక్యముల నుచ్చరించుట చేతను, క్రైస్తవుల జలమును గ్రహించుటచేతను, అన్యమతావలంబు లయిన స్త్రీలను వివాహమాడుట చేతను హిందువులు జాతిచ్యుతులయిన ట్లెంచబడుచుండిరి. అట్టివారు మరల నే విధముగను హిందువులుగా నెంచబడుటకు వీలులేకుండెడిది. కాని దయానంద మహర్షి, శ్రద్ధానందస్వామివారి యత్నములవలన నేడు హిందువుల విచారములలో ననుపమపరివర్తన కలిగిన దనుటలో నెట్టి సందియము లేదు. గత వర్షములందు వేలకొలదిగా ముస్లిములు, క్రైస్తవులు శుద్ధిచేయబడి హిందూసంఘములోనికి తీసికొనబడిరి. మనయాంధ్రప్రాంతము

నను సుమారు పదివేలమంది క్రైస్తవులు ప్రాయశ్చిత్త మొనర్చి హిందువులుగా చేయబడిరి. వారి పూర్వ వంశీయులును వారిని సంతోషముతో స్వీకరించి యెప్పటియట్లు వారితో వ్యవహరించుచున్నారు.

"ఉతదేవా అవహితం దేవా ఉన్నయథాః పునః
ఉతాగ శ్చక్రుషం దేవాః జీవయథాః పునః॥

ఋ. ౧౦. ౧౩౭. ౧

ఈ వేదమంత్రమున పాపకృత్యములచే పతితు లయిన వారి నుద్ధరింప నుద్దేశింపబడియున్నది.

"పునన్తు మా దేవజనాః పునంతు మన వో ధియా,
పునన్తు విశ్వాభూతాని, పవమానః పునాతు మామ్

అ ౬. ౧౯. ౬.

ఈ యాథర్వణ మంత్రమున అధర్మాచరణ వశమున పతితుడగు మానవుడు జ్ఞానులగు విద్వాంసులచెంత జేరి వారి వలన తన యాత్మను శుద్ధిపరుచుకొను నిమిత్తమై వారిని ప్రార్థించు విధానము స్పష్టముగా బోధింపబడి యున్నది. ఇట్లే పురాణములందు సైతము ఆత్మశుద్ధి నపేక్షించి తనచెంత జేరు వారిని రాగద్వేషాదులచే, శుద్ధి జేయకుండుట బ్రహ్మహత్యా సమపాతక మగునని బ్రాహ్మణుల కుపదేశింపబడి యున్నది. స్కాందపురాణమున నీ శ్లోకములను తిలకింపుడు.

"విశుద్ధిం యాచమానస్య యది యచ్ఛన్తి నో ద్విజాః
కామాద్వా యదివా క్రోధాత్ ప్రద్వేషాద్వా చ్యుతే
ర్భయాత్

బ్రహ్మహత్యోద్భవం పాపం సర్వేషాం తత్ర జాయతే
తస్మాదభ్యాగతో యస్తు దూరాదపి విశేషతః
తస్య శుద్ధిః ప్రదాతవ్యా ప్రయత్నేన ద్విజోత్తమైః

స్కాంద. ౨౦౧ అ.

ఇట్లసంఖ్య ప్రమాణములు పతితుల శుద్ధుల నొనర్చి సంఘశక్తిని కాపాడ నుపదేశించుచుండ తన సంఘమునుండి యజ్ఞానాదికారణవశమున మతాంతరులలో ప్రవేశించి జ్ఞానము కలుగుట తోడనే మరల స్వమతమును గ్రహింపనెంచువారిని శుద్ధిజేసి తమసంఘములందు కలుపుకొని వారి యున్నతి కవకాశ మొసగకుండుట యవిచారముగాక మ రేమగును? ఒకానొక యనాచార వశమున హిందువు క్రైస్తవుడో మహమ్మదీయుడో కాగలిగినపుడు మరల సదాచారగ్రహణమున హిందువు డేల కారాదో తెలియకున్నది. హిందూజాతి నేడైనను కన్నులు తెరచుట మంచిది. లేకున్న కొలది కాలములోనే భూతలమున హిందూజాతి నామావశిష్ట మగును. నేడు హిందూజాతినుండి దినదినము వేలకొలది క్రైస్తవాది మతములందు కలిసిపోవుచుండుట మన మెరుగని విషయము కాదు. ఇట్లు ప్రతిదినము జాతినుండి వేరగుచు నిందు ప్రవేశించు

ద్వారము మూయబడునేని క్రమముగా జాతి యంత మొంద కేమగును? అందువలన నార్యసమాజముచే ప్రారంభింపబడి సమాజసంఘటనను మిగుల నుపయుక్తమగు నీ శుద్ధికార్యమున ప్రతిహిందువు తన సహాయోగితను జూపు నని యాసించు చున్నాము.



# తృతీయాధ్యాయము



ఆర్యసమాజకార్యములు:—

ఆర్యసమాజము నెలకొని నేటికి దాదాపు ౬౫ సంవత్సరములు కావచ్చుచున్నది. ఈ దీర్ఘకాలమున జాతి దేశ కల్యాణముకొరకై యార్యసమాజ మొనర్చిన మహాకార్యములను సంక్షేపముగా నిట వర్ణించుచున్నాము.

౧ వేదప్రచారము:—దయానంద మహర్షి వైదిక ధర్మమును పునరుద్ధరింపదలచి తదనుకూల ప్రచారము ప్రారంభించినపుడు వారాణసి మున్నగు ప్రసిద్ధ విద్యా కేంద్రములందు శాస్త్రార్థములు జరుపబడెను. ఆ శాస్త్రార్థములందు ప్రమాణములద్వారా సత్యనిర్ణయ మొనర్చుటకై వేదాది గ్రంథము లవసరమయ్యెను. కాని యాసమయమున ఆర్షగ్రంథములు వేదములు దుష్ప్రాపము లయియుండె నని వ్రాయవలసి వచ్చినందులకు దుఃఖము కలుగకపోదు. యవనుల కాలమునం దార్య సాహిత్యము చాలవరకు నష్ట మొనర్పబడెను. మిగిలిన సాహిత్యము బ్రాహ్మణుల యనుదార భావముల మూలమున నజ్ఞాత గర్తమున లుప్తప్రాయ మొనర్పబడెను. ప్రప్రథమమున దయానంద మహర్షి జర్మన్ దేశమునుండి ప్రాచీన హస్తలిపిలో వ్రాయబడిన వేదములను తెప్పించి నాలుగు వేదముల నచ్చొత్తించి

ప్రకాశింపజేసెనని వినినప్పుడు పాఠకుల కాశ్చర్యము కలుగక యుండనేరదు. అజిమీరునందు వైదిక యంత్రాలయమును స్థాపించుటలో మరియొక యుద్దేశమే లేదు. వేదముల నిట్లు మూలరూపమున ప్రకాశింపజేసినందువలన మహర్షికి విశేష సంతోషము కలుగదయ్యె. వేదములకు హిందీ, సంస్కృత భాషలలో భాష్యము వ్రాయ నారంభించెను. యజుర్వేద భాష్యము సంపూర్ణమయ్యెను. ఋగ్వేదమున రెండు వంతులు పూర్తిచేయబడెను. కాని యీ మహాకార్య సంపూర్తిని విరోధులు సహించలేకపోయిరి. గాజుపొడి పాలలో గలిపి ఋషిచే త్రావింపజేసిరి. పరిణామమున క్రీ. శ. ౧౮౮౩ అక్టోబరు ౩౦ తారీఖున మహర్షి ప్రాణములను విడువవలసి వచ్చెను. వేదభాష్యమేకాక ఋగ్వేదాదిభాష్యభూమిక యను గ్రంథ మొక్కటి ఋషిచే వ్రాయబడెను. ఈ గ్రంథ మనేక విదేశ భాషలందును అనువదింపబడినది. వైదిక సాహిత్యమున నీ గ్రంథ మపూర్వమయినది.

దయానంద మహర్షి పదచిహ్నముల ననుసరించుచు నార్యసమాజ మనేక పుస్తకములను వేదముల సంబంధమున ప్రకాశింపజేసినది. వేదములయు నుపనిషత్తులయు ననేక భాష్యములు ప్రకాశింపచేయబడినవి. ప్రస్తుతమున భారత వర్షమునందు జరుగు వేదసంబంధమయిన సంశోధనకార్యము లన్నియు నార్యసమాజముతో విశేష సంబద్ధము లనిన నతిశయోక్తి

కాదు. వేదవిషయములకు సంబంధించిన చిన్న చిన్న పుస్తకముల నార్యసమాజము జనుల కందజేసినది. బ్రాహ్మణులు వేదములను గుత్తకు తీసికొని యన్యులు దీనిని పఠింప నర్హులు కారని వచించు చున్నారు. సంధ్యావందనాది నిత్యకృత్యముల కల్పములు, సంస్కారవిధులు, నన్నియు నవైదికములై యున్నవి. వానిలో శ్లోకములు, వాక్యములు ననేకములు గలవు. ప్రస్తుత మార్యసమాజము వీని నన్నిటిని సంస్కరించి వేదమంత్రములతో వీనిరూపమును మార్చివైచినది. దయానందమహర్షి రచిత సంస్కారపద్ధతిని ప్రచార మొనర్చుచున్నది.

౨ శిక్షాసంస్కరణము

ఇందు ప్రథమ సంస్కరణము మన విద్యాపద్ధతియందు మాధ్యమిక భాష, దేశభాషగా నొనర్చుటమైయున్నది. దయానందుని మాతృభాష గుజరాతి. అభ్యస్తభాష సంస్కృతము. అయినను మహర్షిచే వ్రాయబడిన గ్రంథము లన్నియు హిందీ భాషయందే వ్రాయబడి యున్నవి. ఇది జరిగి నేటికి సుమారు డెబ్బది సంవత్సరముల కాలము గతించు చున్నది. ఆ సమయమున భారత వర్షమునందు హిందీ రాష్ట్రభాష కాగలదని స్వప్నమందైన నెవరు తలంచియుండరు. మహర్షి దూరదర్శి. అతడు దీనిని ఆర్యభాష యనెను. ప్రతి ఆర్యునకు హిందీనేర్చు టావశ్యక మని నుడివెను. ఇట్లు భారత వర్షమున హిందీ ప్రచారము యొక్క ప్రారంభక కీర్తి యార్యసమాజ

మూడవ సంస్కరణ కార్యము భారతీయులకు భారతీయ సంస్కృతి, సభ్యత, ధర్మము మున్నగు విషయముల జ్ఞానము కలిగించుట యయియున్నది. ఆంగ్లేయులచే భారతమున ప్రచారము చేయబడిన శిక్షాపద్ధతి భారతీయుల రూపరేఖలనే మార్చినది. అట్టివారికి మరల భారతీయ స్వరూపము నొసంగుట యావశ్యకము. ఆర్యసమాజముద్వారా గురుకులములు దయానంద ఆంగ్లోవైదిక కళాశాలలు స్థాపింపబడెను. ఈ రెండువిధములయిన సంస్థలును ప్రాచీన వైదికాదర్శములతో నడుపబడి శిక్షాపద్ధతిలో ననల్పమగు మార్పు నొనరించి నూతనశిక్షణ నొసంగుచున్నవి.

దయానందుని మరణానంతరమున కీ॥ శే॥ పం. గురుదత్తవిద్యార్థి, ఎమ్. ఎ., పంజాబుకేసరి, లాలా లజపతిరాయ్, మహాత్మ హంసరాజు మున్నగు ఆర్యనాయకులు కలిసి 'లాహోర్' నగరమున 'దయానంద ఆంగ్లో- వైదికకాలేజ్'ని స్థాపించిరి. దీని యుద్దేశము సామాన్య శిక్షణకు తోడుగా దయానందునిచే జూపబడిన వైదిక సభ్యతను విద్యార్థులకు నేర్పుటగా నెంచబడెను. ఈ సంస్థ జనుల ప్రేమకు మిక్కిలి పాత్రమైనది. పంజాబు ప్రాంతమున నేడు దీనికి సంబంధించిన విద్యాలయములలో లక్షలకొలది విద్యార్థులు చదువుచుండుట ప్రశంసనీయవిషయము.

స్వర్గీయ శ్రద్ధానందస్వామి తన యాస్తినంతయు వినియోగించి క్రీ॥ శ. ౧౯౦౨ న గంగానదీతీర భూమిలో ప్రాచీన

బ్రహ్మచర్య పద్ధతి నుద్ధరించు నుద్దేశముతో గురుకులాశ్రమ మును స్థాపించెను. నాడు జనులలో నీ యిరువదియవ శతాబ్ద మున తమ ప్రాణప్రియులగు పుత్రిలను చిన్నతనముననే పదు నాలుగు వత్సరములకాల మరణ్యావాస మొనర్చి గురుకుల మున విద్యాభ్యాస మొనర్ప పంపువా రెవరుందు రనువాదము ప్రబలియుండెడిది. కాని ఆ వీరసంన్యాసి ప్రతాపమున నే డా కాంగడీ గురుకులము విశాలరూపము ధరించి విలసిల్లు చున్నది. దీనికి సంబంధించిన చిన్నపెద్ద గురుకులములు భార తముననేగాక దక్షిణాఫ్రికాయందును నేడు జనులకు ప్రియ సంస్థ లయి యున్నవి. ఈ గురుకుల స్నాతకులు ధర్మప్రచార క్షేత్రము నందును, దేశసేవయందును భారతీయ సాహిత్య సంపద నభివృద్ధి నొందించుటలోను జనాదరణమును పొంద దగు కార్యముల నొనర్చిరి. ఈ సంస్థయందు గమనింపదగిన విషయములు మూడు గలవు.

(౧) ప్రాచీన ఆశ్రమ శిక్షాపద్ధతిని ఉద్ధరించుట. అన్య పాఠశాలలలో విద్యార్థులకు పాఠశాలలో నున్నంతకాలమే గురువులతో సంబంధ ముండును. పాఠశాలను విడిచి బయటికి వచ్చిన తరువాత గురువుల నియంత్రిణము వారిపై నుండదు. గురుకులములందు ఎనిమిది వర్షముల ప్రాయమున బాలుడు ప్రవేశించును. పదునాలుగు వర్షముల సమయ మా బాలుడు నిరంతరముగా తన గురువుల నిరీక్షణమున నుండును. అందు

వలన విద్యార్థి తన యాచారములను సంస్కరించుకొన నెంతో వీ లుండును.

(౨) స్వకీయ శిక్ష నొసంగుట రెండవ విషయము: గురుకులమున ప్రవేశించినది మొదలు పదునాలుగేండ్ల సమయము భారతీయ ధర్మము, భారతీయభాష, భారతీయ సభ్యతకు సంబంధించిన శిక్షణ విద్యార్థులకు లభించును. విద్యార్థులు అన్నివిధముల భారతీయ వాసనలతో నింపబడుదురు. విదేశసంస్కారములు వారిలో ప్రవేశింపనేరవు.

(3) స్వభాషలో సంపూర్ణశిక్ష నొసంగుట మూడవ విశేషము. గురుకులమున నన్నివిషయములు హిందీభాష యందు నేర్పబడును. అందువలన విద్యార్థులు కొలది సమయములోనే యెక్కువ జ్ఞానోపార్జన చేయగలుగుదురు. పాశ్చాత్య దర్శనములు, విజ్ఞానము, ఆంగ్లేయభాష మున్నగు విషయములుగూడ ఉపేక్షింపబడక ఉచితరీతిని నేర్పబడును. భారతీయ దర్శనములకు విజ్ఞానమునకు సంస్కృతభాషకు ప్రాముఖ్య మొసంగబడును. అందువలన గురుకులములు పూర్వ పశ్చిమ విజ్ఞాన సంస్కృతులను ఉత్తమరీతిని శిక్షించునట్టి యాశ్రమము లని తెలియనగును.

3 కన్యా గురుకులము:—

ఆర్యసమాజము కార్య క్షేత్రమున నడుగిడుటకు పూర్వము స్త్రీ, శూద్రులు పశువులుగా నెంచబడుచుండిరి.

వారికి చదువుట కధికారము లేకుండెను. ఈ ప్రాంతమున నేటికిని స్వార్థపరులు జ్ఞానదూరులు నగు బ్రాహ్మణనామకులు "స్త్రీశూద్రౌ నాధీయాతామ్" స్త్రీలు శూద్రులు చదువతగరని వాదించువా రెందరో గలరు. కాని ఋషి దయానందుడు వేదశాస్త్ర ప్రమాణములద్వారా భారతమున ప్రాచీన కాలమున స్త్రీలు శిక్షితులైయుండిరనియు నేడును శిక్షను బొంది సమాజమునకు రాష్ట్రమునకు సంబంధించిన కార్యములందు పాల్గొనవలయుననియు బోధించెను. అందువలన నేడు బాలక గురుకులములవలె కన్యా గురుకులమును డేరాడూనులో స్థాపింపబడియున్నది. అందన్నివర్ణములకు సంబంధించిన కన్యలు పదునారు వర్షముల ప్రాయమువరకు బ్రహ్మచర్య పూర్వకముగా నధ్యయన మొనర్చుచున్నారు. జాలంధర్ నగరమందొక కన్యా మహావిద్యాలయము స్త్రీశిక్ష నుత్తమరీతిని వ్యాపింపజేయుచున్నది. ఇట్లే బడోదాలోను ఇతర ప్రాంతములలోను స్త్రీవిద్యాలయము లనేకరూపముల నుత్తమకార్య మొనర్చుచున్నవి.

౪ వివాహసంస్కరణ:—

మహాభారత సమయము గతించినతరువాత భారతము క్రమముగా నధఃపతన మగుచుండుట జగద్విదితమే. యవన కాలమున నార్యజాతి విశేషముగా నధోగతి నొందినది. దాని రూపమును వర్ణించుటకు లేఖిని వెనుకాడుచున్నది. ఐదారు

వర్షముల ప్రాయముననే కన్యలు వివాహిత లగుటయు రెండు మూడు వత్సరముల ప్రాయముననే విధవ లగుటయు భారత వర్షమునతప్ప మరియొక ప్రదేశమున జూడనేరము. ఏడెనిమి దేండ్ల ప్రాయముగల బాలవిధవల సంఖ్య భారతమున లక్షల వరకు పెరిగినదన్న నతిశయము లేదు. ఏదేశమున లక్షలకొలది కన్య లింత చిన్నవయస్సున వైధవ్యము ననుభవించవలసి యుందురో యాదేశమున నాచార మెట్లుండునో పాఠకు లూహింతురుగాత. ఇందువలననే నేడు భారతవర్షమున దురాచారము మెండుగా జూడబడుచున్నది.

"అష్టవర్షా భవే ద్గౌరీ" అను నీ శ్లోకము జాతికి దేశము నకు పరమశత్రువగు నేమానవునిచే రచింపబడెనో చెప్పజాలము. ఈ శ్లోకము ఆర్ష గ్రంథములలో నెక్కడను జూడబడదు. యవన సామ్రాజ్యము దేశమున ప్రవర్తిల్లిన రోజులలో కాశీనాథుడను బ్రాహ్మణ పండితునిచే వ్రాయబడినట్లు తెలియుచున్నది. శైశవావస్థలో జరుగు వివాహముల భయంకర పరిణామ మా యల్పబుద్ధి కెట్లు తెలియగలదు? ఈ బాల వివాహముల చేతనే హిందువుల ఆయుష్పరిమాణము తగ్గిపోయినది. శక్తి నశించినది. దయానందమహర్షి హిందువులను జూచి "ఈ పిల్లల పిల్లలు ప్రపంచమున నేమి చేయగల"రని చింతించుచుండెడివాడు. బాలబాలికలు పూర్ణ బ్రహ్మచర్యమును పరిపాలింపకున్న గృహస్థాశ్రమమున ప్రవేశింప నధి

కారులుకారు. అందువలననే ఆర్యసమాజము బాల, బాలికలకు క్రమముగా ౨౫ - ౧౬ సంవత్సరముల ప్రాయము రాకముందు వివాహ మొనర్పరాదని నియమించు చున్నది. మనుస్మృతిలో నొక శ్లోకమున:-

"త్రీణి వర్షా ణ్యుదీక్షేత కుమా ర్యృతుమతీ సతీ
ఊర్ధ్వంతు కాలా దేతస్మాద్ విందేత సదృశం పతిమ్"

అనియు మహాభారతమున

"త్రీణి వర్షా ణ్యుదీక్షేత కన్యా ఋతుమతీ సతీ
చతుర్థే త్వథ సంప్రాప్తే స్వయం భర్తార మర్జయేత్"

అనియు వర్ణింపబడినది. వీని తాత్పర్య మేమనగా కన్య రజస్వల యయిన తరువాత మూడు సంవత్సరముల కాలము గడిపి యనంతరమున తన కనుగుణమగు పతిని స్వయముగా వరింపవలయును. ఈ శ్లోకాభిప్రాయముల ననుసరించి వివాహ యోగ్య సమయము కన్యలకు పదునారేండ్ల వయస్సని స్పష్ట పడు చున్నది. ఇట్లే సుశ్రుతమునందును ఇరువది యైదేండ్ల ప్రాయముగల యువకుడు పదునారేండ్ల యీడుగల యువతిని పెండ్లాడుట శ్రేయస్కరమని చెప్పబడినది. ఇది వైద్యక గ్రంథ మగుటచే దీని ప్రామాణికతను గూర్చి విశేషముగా వ్రాయ నవసర ముండనేరదు. పై ప్రమాణములచేతను యుక్తులతో విచారించుటచేతను బాలవివాహ మధర్మ మని తోచకపోదు.

ఇట్లే వృద్ధ వివాహములు, అసమాన వివాహములు నిషిద్ధము లని వ్రాయుట యనవసరమని యెంచుచున్నాము.

ఉత్తర భారతమున ననేకులు బహు వివాహములను జేసికొను దురాచారమును సదాచారముగా నెంతురు. దీనిని నిషేధించుటకై యార్యసమాజము శతవిధముల యత్నించెను. ఆర్యసమాజ మేకపత్నీవ్రతమును ధర్మముగా నెంచును.

౫. విధవావివాహములు.

హిందూజాతియందు బాల వివాహములు ప్రబలముగా నుండుటచే లక్షలకొలది యువతులు వైధవ్యము ననుభవించు చున్నారు. గృహములందు వీరి జీవన మెంత కష్టప్రదమో మనకు తెలియనిది కాదు. 'మిస్ మేయో' ప్రభృతి విదేశీయ సమాలోచకులపై మనకు క్రోధము కలుగును. కాని వస్తుతః మన సంఘమున గల దురాచారములను జాగ్రత్తగా తిలకింతు మేని మనకు వారి సమాలోచన లంతగా కటు వనిపించవని యెంతుము. పురుషులు ౬౦,౭౦ వర్షముల ప్రాయముననుు బాలికలను వివాహమాడ సిద్ధపడుదురు. సమాజమును వారి నడ్డుపెట్టదు. ౧౫, ౧౬ సంవత్సరముల ప్రాయముగల, విధవలు వైధవ్య దుఃఖముల ననుభవింప బలాత్కరింపబడుదురు. వారి వస్త్రములను, భూషణములను, కేశములను సైతమపహరించి కురూప మాపాదింపజేసి శేషదీర్ఘజీవనమును దాస్య మొన ర్చుచు గడుపుటకై నిర్బంధింతురు. ఇంతకంటె నన్యాయ మే

ముండును? ఉత్తరభారతమున నదను దొరికినపు డెల్ల నిట్టి విధవలు మహమ్మదీయుల పాలగు చుందురు. కొందఱు క్రైస్తవుల శరణుజొత్తురు. అనేకులు కామవశమున నొనరించిన దురాచారములను కప్పిపుచ్చుటకై యాత్మఘాత నొనరించు కొందురు. ఇట్టి దుర్భర సందర్భములను జూచుచు వానికి ప్రతిక్రియ నొనర్పక కన్నులు మూసికొనుట మానవత్వము కానేరదు. అందువలన నిట్టి సమస్యలను పరిష్కరించుటకై యార్యసమాజము విధురులవలె విధవలకును సమాజమున స్వాతంత్రిత నిచ్చుట శ్రేయస్కరమని నిశ్చయించెను. బాల విధవలు బ్రహ్మచర్యమును నిర్వహింపజాలని పక్షమున నిష్ట మున్న విధుర పురుషులవలె స్త్రీలును పునర్వివాహ మొనర్చుకొనుట అనుచితమని యార్యసమాజ మెంచదు. లాహోర్ నగరమున ప్రసిద్ధముగా నున్న విధవా వివాహ సహాయకసభయొక్క ముఖ్యోద్దేశ మిదియే.

౬. వరకట్నము, కన్యావివాహము, ఘోషాపద్ధతి.

ఇవి మూడును అనాచారములని యార్యసమాజ మెంచును. వీనిని వారించుటకై యార్యసమాజ మొనర్చిన ప్రయత్నములెంతయు ప్రశంసనీయములు. ఇట్టి ప్రయత్నములవలన కలిగిన కీర్తి యార్యసమాజమున కధికముగా లభించినది.

౭ అస్పృశ్యోద్ధరణము:—

హిందువులచే నానా విధముల ననాదరింపబడు మాల

మాదిగ జాతులకు సంబంధించినవారికి సమాజ మన్నివిధము లయిన యవకాశములు కల్పించి, విద్యాబుద్ధులను గఱపి, బ్రాహ్మణాదివర్ణములకు చెందిన వారితో సమానముగా నస్పృశ్యులతో వ్యవహరించుచున్నది. ఆర్యసమాజయత్నములచే నుత్తర భారతమున నే డెందరో చండాల కులోత్పన్నులు సంస్కృత భాష నభ్యసించి ధర్మోపదేష్టల కార్య మొనర్చుచున్నారు. అవకాశ మిచ్చుచో మానవబుద్ధి యేల వికసింపదు? కులములు దాని నెట్లడ్డగింపగలవు?

౫. దేశసేవ:—

దేశమునందు జాగృతిని కలిగించుటకై యనేక సంఘములు యత్నించినవి కాని యట్టి యత్నములవలన కలుగు కీర్తిలో నధికభాగము లార్యసమాజమునకే చెందియున్నవి. సుమారు ౬౦ సంవత్సరములకు పూర్వమే దయానంద మహర్షి సత్యార్థప్రకాశమున దేశసేవకు స్వరాజ్యమునకు సంబంధించిన భావము నీక్రింది శబ్దములలో ప్రకాశించియున్నాడు.

"జిస్ దేశకే పదార్థోంసే అప్నా శరీర్ బనా అబ్ భీ పాలన హోతాహై ఆగే హోగా ఉస్‌కి ఉన్నతి తన్ మన్ ధన్ సే సబ్ జన్ మిల్ కర్ ప్రీతిసే కరే."

"కోయీ కిత్ నాహీం కరె జో స్వరాజ్య హోతాహై వహీ సర్వోపరి ఉత్తమ హోతా హై. మత మతాంతరకే ఆగ్రహరహిత్ అప్నే ఔర్ పరాయేకా పక్షపాత శూన్య

ప్రజాపర్ మాతాపితాకే సమానకృపా న్యాయ ఔర్ దయాకేసాథ్ విదేశీయోంకా రాజ్యభీ పూర్ణ సుఖదాయక నహీం హై"

ఏ దేశమున తమశరీర మేర్పడి పాలింప బడినదో ఆ దేశోన్నతికై తను, మనో, ధనములతో నెల్లరు కలిసి ప్రేమతో యత్న మొనర్పవలయును. ఎవ రెంత జేసినను స్వరాజ్యమే సర్వోత్తమము. స్వపరపక్షపాతము లేక తల్లిదండ్రులు పిల్లలను జూచునట్లు దయతో న్యాయముతో పరిపాలించున దైనను విదేశీయరాజ్యము పూర్ణసుఖదాయకము కాదని పై వాక్యముల తాత్పర్యము.

రాష్ట్రీయ మహాసభ (కాంగ్రెస్) జన్మించుటకు ౧౦-౧౫ సంవత్సరములు పూర్వమే మహర్షిచే వ్రాయబడిన యీ వాక్యములు రానున్న రాష్ట్రీయోద్యమ సూచకములనుట నిర్వివాదవిషయము.

వర్తమాన కాలమున మన రాష్ట్రీయ మహాసభ పరిష్కరింపదలచిన సమస్యలు ముఖ్యముగా నాలుగని చెప్పవచ్చును. హరిజనుల నుద్ధరించుట, హిందీని రాష్ట్రభాష నొనరించుట, ప్రజల నధికముగా శిక్షితులుగా నొనర్చుట, మద్యము మున్నగు మత్తుపదార్థములను నిషేధించుట ప్రస్తుతకార్యక్రమమున ముఖ్యస్థానము నాక్రమించుచున్నవి. భారతమున నందరికంటెముందు ఆర్యసమాజమే యీ విషయములను తన కార్య

క్రమమునకు లక్ష్యమొనర్చియుండెను. "ఆర్యసమాజము మన మాతృభూమి నుద్ధరించుటకై మహాయత్న మొనర్చినది. అందు వలన నా సమాజము మన చిరకృతజ్ఞతకు పాత్రమైయున్నది" అని యొకప్పుడు నిండుసభలో చెప్పిన పి. సి. రాయ్‌గారి వాక్యములు సముచితము లయి యున్నవి. "దయానందస్వామి యొక ఋషి యగుట నిస్సందేహము. వారు భూతభవిష్యముల నేక మొనర్చిరి. రాష్ట్రమును పునరుద్ధరించిరి" అను నీ వాక్యములు దయానందుని విషయమున పాల్ రిచర్డ్ వ్రాసి యుండెను.

ప్రతి ఆర్యసమాజియు దయానందమహర్షి యొక్క దివ్యప్రకాశముతో నిండియుండును. ఆర్యసమాజము ప్రతి దేశహితకార్యమునందును ముందు నడుచును.

అంతిమ నివేదనము—

ఆర్యసమాజ సందేశ మేమను ప్రశ్నకు సంక్షేపముగా సమాధానము జెప్పిన, ప్రపంచమునగల సమస్తధర్మముల దృష్టి కోణము మార్చుటయే యనవచ్చును. ధర్మము విజ్ఞానము నను నీరెండును పరస్పరవిరోధివిషయము లనుట మూర్ఖత యని దయానందమహర్షి చాటించెను. ధర్మశాస్త్రములలో

"య స్తర్కేణానుసంధత్తే స ధర్మో వేద నేతరః"

యుక్తులతో విచారించిన నిలబడునదియే ధర్మమని వర్ణింపబడియున్నది. ఆర్యసమాజము హిందువులనుండి దూర

ముగా నుండు సంఘము కాదు. హిందువులచే నాదరింపబడు వేదములు ఉపనిషత్తులు బ్రాహ్మణ గ్రంథములు సమాజము నకును మాన్యములే. ప్రాచీన వర్ణాశ్రమవ్యవస్థయే ఆర్యసమాజమునకును గ్రాహ్యమైయున్నది. కాని దీనిలో గల ప్రాచీన సుందర ఆదర్శముల స్థానమున హిందువులచే గ్రహింపబడిన అంధవిశ్వాసములను, పాషండులచే ప్రచురింపజేయబడిన అవైదికాచారములను ఆర్యసమాజము ఘృణితదృష్టితో చూచుటయే గాక వానిని హిందూ సమాజమునుండి దూర మొనర్చి, దానిస్వరూపమును పరిమార్జిత మొనర్ప నిరంతరము యత్నించుచున్నది. భారతవర్షమున మరల ప్రాచీన వైదిక సభ్యత వ్యాపింపవలయుననియు, ఆర్యజాతి తన ధార్మిక సామాజిక సంఘటనములను సరిజేసికొని ప్రపంచమును నడుపు జాతులలో తన నామము నంకిత మొనర్పవలయుననియు నార్యసమాజము కోరుచున్నది.

ఆంధ్రపాఠకులారా! ఆర్యసమాజ సిద్ధాంతములు స్వదేశమునకును, మనుష్యజాతికి నెంత యుపకారకములో పరికింపుడు. దేశభక్తు లెవ్వరును ఆర్యసమాజ ప్రచారావశ్యకతను తిరస్కరింపజాలరు. మీలో నెవరికైనను ఆర్యసమాజ కార్యములలో నొకదానియందైన సానుభూతి యున్నచో ఆర్యసమాజమున ప్రవేశించి మానవజాతికిని దేశమునకును సేవ జేయుడు. ప్రతి మనుష్యుడు తన స్వభావానుకూలమగు

కార్యము నిందు గ్రహించి తన సేవను ప్రదర్శింప వీలున్నది. ఆర్యసమాజ మొక విశాల కార్యప్రణాలిని గలిగియున్నదని యీ పుస్తకము జూచినవారికి వేర చెప్పనేల! మాంసభక్షణను జీవహింసను మీ రేవగింతురేని యార్యసమాజముతో తమ చేతులను గలిపి దేశమునుండి యీ దురాచారమును దూర మొనర్పుడు. మద్యపాన మహితకరమని యెంతురేని రండు దానిని తొలగింప నడుములు కట్టుదము. నాస్తిక వాదము యొక్క చెడుగులు మీ మనస్సులకు తోచినచో నార్యసమాజ మందుల కత్యంతోపయోగియును కార్యకారియు నగు సంఘము. అస్పృశ్యుల నుద్ధరించుటను మీరు ప్రేమింతురేని ప్రపంచమున నార్యసమాజమున నున్నంత యవకాశము మరి యేసమాజమునందును లేదని మీరు నిశ్చయముగా నమ్ముడు. ఆధ్యాత్మికోన్నతి నభిలషింతురేని యార్యసమాజ మందుల కుపయోగించు నుత్తమోత్తమ సాధనములను మీకు చేకూర్చును. దయానంద మహర్షి తపోబలము, ఆత్మత్యాగము; ధర్మమునందును జాతియందును మహర్షికి గల గాఢానురాగము, ఆత్మసమర్పణమును దేశహితైక ప్రాణులగు మిమ్ముల నీ పవిత్ర యజ్ఞమున శక్తికొలది పాల్గొన నాహ్వానించుచున్నవి. దయానంద మహర్షి శబ్దములతో నీ గ్రంథమును పూర్తిజేయుచున్నారము.

ప్రాచీన సమయమున భూమండలము నందంతట వేదోక్త ధర్మమే వ్యాపించి యుండెను. దానియందే యంద

రికి పూర్ణనిష్ఠ యుండెడిది. నాడు ఒండొరుల సుఖ దుఃఖము లను హానిలాభములను సమానముగా నెంచుచుండెడివారు. నే డనేక మతములు వ్యాపించుటచే ననేకవిధదుఃఖములు విరోధములు నెక్కు వయినవి. వీనిని నివారించుట మద్ధిమంతుల కర్తవ్యమై యున్నది. ఈశ్వరుడు మిథ్యామతములను దూర మొనర్చి సత్యబుద్ధిని జనుల కందరికి ప్రసాదించుగాత. విద్వాంసు లందరును విరోధభావమును విడిచి సద్విచారము లతో నానందము ననుభవింతురు గాక.

"హే జగదీశ్వరా! నీ సామర్థ్యముచే మాయందు పరస్పర ద్వేషము ప్రబలకుండుగాక. మా విద్యాబుద్ధులు, కార్యకలాపములు, ధనసంపత్తులు నన్నియు నందరిక్షేమమునకై వినియోగించు గాక— హే జగన్మంగలమయ భగవన్ !! దుఃఖములనుండి విముక్తుల నొనర్చి సుఖప్రాప్తి కనువగు బుద్ధి నొసంగుము"

"అసతో మా స ద్గమయ
తమసో మా జ్యోతి ర్గమయ
మృత్యోర్మా అమృతం గమయేతి"

ఓమ్ శాంతిః శాంతిః శాంతిః



## ఆర్యసమాజోపనియమములు

నా మ ము

౧ ఈ సమాజము 'ఆర్యసమాజ'మన బడును.

ఉ ద్దే శ ము

౨ ఈ సమాజముయొక్క ఉద్దేశము పూర్వలిఖిత నియమములందు వర్ణింపబడినదియే.

ఆ ర్యు లు

3 ఆర్యసమా జోద్దేశానుకూలముగా నాచరణమును స్వీకరించుచు సమాజమున నామాంకితముచేయ దలచువారు ఆర్యసమాజమున ప్రవేశింప నధికారు లగుదురు. *కాని సమాజమున ప్రవేశింపదలచువ్యక్తి పదునెనిమిది [౧౮] వర్షములకు తక్కువ వయసు గలిగి యుండరాదు. ఇట్లు ఆర్యసమాజమున జేరువ్యక్తులు ఆర్యు లనబడుదురు. కాని ఒక వ్యక్తి యొక సమయమున నొకేసమాజమున సదస్యుడు కాగలడు.

---

* ఆర్యసమాజమున నా మ ము చేర్పదలచువారు సమాజ మంత్రికి పత్రమొకటి యిట్లు వ్రాయవలయును. "నేను ప్రసన్నతాపూర్వకముగా నార్యసమాజోద్దేశములను సిద్ధాంతములను నొప్పుకొనుచు వాని కనుకూలా చరణమును స్వీకరించు చున్నాను. నాపేరు ఆర్యసమాజమున చేర్చుకొనుడు." కాని సమాజముయొక్క అంతరంగసభ యేదైన విశేష హేతువును పురస్కరించుకొని యేవ్యక్తి నామమైనను సమాజమున చేర్పకుండునట్లు చేయుట కధికారము గలిగియుండును.

ఆర్యసభాసదులు

౮ (క) ఆర్యసమాజమున నేవ్యక్తినామము సదాచార పురస్సరముగా నొక ♦ సంవత్సర కాల మంకితమై యుండునో యేవ్యక్తి తన యాదాయమున † నూరవవంతుకు తక్కువగాకుండ మాసికముగానో లేక వార్షికముగానో చందా నిచ్చుచుండునో, మరియు సాప్తాహికసత్సంగములలో నూటికి 25 యిరువదియైదుకు తక్కువగాకుండు నుపస్థితి యుండునో అట్టివ్యక్తి ఆర్యసభాసదుడు కాగలడు.

---

♦ ఆర్యసభాసదు డగుట కొక సంవత్సరము సమాజమున తన నామము నంకితము చేసియుండవలయునను నియమమును, కొందరు వ్యక్తుల కొరకు విద్యాదివిశేషగుణములను హేతువుగాగొని యంతరంగసభ శిథిలము చేయగలదు.

† (క) అంతరంగసభ, విశేష కారణముల వలన చందా నీయలేనివారిని, శతాంశముకంటె తక్కువచందా నిచ్చువారిని కూడ ఆర్యసభాసదులనుగా తీసికొనన నధికారము గలిగియుండును. కాని అట్టివారు నూటి కైదుగురుకంటె నెక్కువగా నుండరాదు. లేక ఒకరిని తీసికొనవచ్చును.

(ఖ) అంతరంగసభ ప్రతివర్ష మిట్టి యార్యసభాసదులనామముల నంకితము జేయుచుండును.

(ఖ) పై జెప్పిన సదాచార మెట్టిదన, సంధ్యా - అగ్నిహోత్రాది నిత్యకర్మలకు చేయుట, శుద్ధవృత్తితో నుండుట, వైదిక సంస్కారముల నాచరణకు తెచ్చుట, పతి-పత్నీ వ్రతముల నెరవేర్చుట మున్నగునవి సదాచారము లనబడును.

వ్యభిచారము, మద్యము మున్నగు మాదక ద్రవ్యము లను మాంసాది అభక్ష్యములను సేవించుట, జూదమాడుట, దొంగతనము చేయుట, మోసగించుట, లంచము తీసికొనుట మున్నగునవి దురాచారములు.

(గ) సమ్మతి నిచ్చు యోగ్యత ఆర్యసభాసదులకే ఉండును. *

(ఘ) ఆర్యసమాజమున నొక్క-సంవత్సరము పూర్తిగా నామ ముండవలయునను నియమము సమాజస్థాపన జరిగిన రెండవ సంవత్సరమునుండి కార్యరూపమునకు వచ్చును.

(చ) ఆదాయము భర్తల యధీనమున నున్న స్త్రీలు ఆర్యసభా సదులు కావలయు నని కోరుచో, వారు తమ సంరక్షకుల యాదాయమున శతాంశములో నైదవవంతు మాత్రము సమాజమున కిచ్చిన చాలును.

---

* విశేష పరిస్థితిలో నంతరంగసభ, ఆర్యులనుండి సమ్మతి తీసికొనగలదు.

౫. ఆర్యసమాజోద్దేశములకు విరుద్ధముగా కార్యముల నాచరించు వ్యక్తులను నిషేధించుటకు అంతరంగసభకును, సమాజమునుండి వేరుచేయుటకు సాధారణసభకును అధికార ముండును. కాని, యీ నిర్ణయము నడ్డుపెట్టుటకుగాని విపరీత ముగా నిర్ణయించుటకుగాని ప్రాంతీయ ప్రతినిధిసభ కధికార ముండును.

౬. ఆర్యసభాసదులు సాధారణ ఆర్యసభాసదులనియు మాననీయ ఆర్యసభాసదులనియు రెండు తరగతులుగా నుందురు. మాననీయ (గౌరవ) ఆర్య సభాసదులు విశేష విద్యాదిగుణములవలననో సదాచారమువలననో అధికదానము వలననో అంతరంగసభచే నియమింపబడుదురు.

౭. ఆర్యసమాజమున జరుగు సభలు రెండువిధము లుగ నుండును.

౧. ధార్మికసభలు ౨. ప్రబంధకసభలు (వ్యవస్థాపక సభలు)

ధార్మికసభలు నాలుగు విధములు:—

౧. దైనికసభలు. ౨. సాప్తాహికములు. ౩. వార్షి కములు ౪. నైమిత్తికములు

ప్రబంధకసభలు రెండువిధములు—

౧. వార్షికసభలు ౨. నైమిత్తికసభలు

## ధా ర్మి క స భ లు

౧. (౧) దైనికసభ:—

ఇది ప్రతిదినము జరుగు సంధ్య, హావనము, కథా కాలక్షేపము మున్నగువానికి సంబంధించియుండును.

(౨) సాప్తాహికము:—

ఇది వారమున కొకసారి జరుగును. ఇందు హావనము, ఈశ్వరోపాసనము, ప్రార్థన, భజనలు, కీర్తనలు, ఉపదేశములు నుండును. అంతమున ఋగ్వేదమున గల యంతిమసూక్తము ఉచ్చస్వనముతో పఠింపబడును.

సూచన:— సమాజమునకు సంబంధించినట్టి ముఖ్యవిషయ మేదైన సభకు తెలుపదగిన దున్నచో నిందు తెలుపబడును.

3 వార్షికసభ

ఇది వార్షికోత్సవ మనబడును. విశేషరూపమున ధర్మ ప్రచారము చేయుటకు సమాజమున నధికోత్సాహము కలిగించుటకును సంవత్సరమున కొకమాటు జరుపబడును.

౪ నైమిత్తికసభ

ఇది విశేషకారణ ముపస్థితమైనచో అధ్యక్షుడు మంత్రి (కార్యదర్శి) యు నుచితమని యెంచినపుడు జరుపబడును.

## ప్రబంధక సభ

౧ వార్షికసభ:—

ఈ సభ ప్రతివర్షమునను నిమ్నాంకిత కార్యముల కొరకు జరుగుచుండును.

౧ అధికారులను, అంతరంగ సభయొక్క పరిశిష్ఠిత సభాసదులను న్యాయోపసభాసదస్యులను ఆదాయ-వ్యయ పట్టికలను నిరీక్షించువారిని ఎన్నుకొనుటకు జరుగును.

౨ సమాజముయొక్క గతవర్ష వృత్తాంతమును వినుటకు ఆయవ్యయముల నంచన వేయుటకును జరుగును.

3 అంతరంగసభ నిశ్చయములకు విరుద్ధములగు అప్పీళ్ళు వినుటకు

౪ అంతరంగసభ పంపినవిషయములను నిర్ణయించుటకు

౫ ఈ సభ జరుగు సమయము మున్నగు విషయములును ౧౫ దినములు ముందుగానే సూచింపబడును. ఆ సూచనంలో సభలో ప్రవేశింపజేయదగు విషయముల వివరణ స్పష్టముగా వ్రాయబడును.

ఎన్నిక లిఖిత సమ్మతి పత్రముల ద్వారా జరుగును. తగాదా సంభవించిన పక్షమున నంతిమనిర్ణయము ప్రాంతీయ ఆర్యప్రతినిధిసభ చేయును. అది మాననీయ మగును.

నైమిత్తిక సాధారణసభ

౧౦ (క) ఈ సభ విశేషకార్యమునకై యవసరమని తోచినపుడు నిమ్నలిఖితపరిస్థితులలో జరుగును.

౧ అధ్యక్షుడు కావలయునని కోరి మంత్రి
నపుడు

౨ అంతరంగసభ కోరిన పక్షమున

3 ఆర్యసభాసదులలో దశమభాగపు
ముగ్గురు ఆర్యసభాసదులుగాని హెచ్చు సంఖ్య
కోరుచు మంత్రికి వ్రాసినచో పదునైదు
సభను సమావేశపరుచుట అధ్యక్షులయు మంత్రి
కర్తవ్యము.

అంతరంగసభ:—

౧౧ సమాజముయొక్క సర్వకార్య నిర్వ
యంతరంగసభ యొకటి యేర్పరుపబడును. ఇందు ౨
లగు సభాసదు లుందురు.

౧. అధికారులు ౨. ప్రతిష్ఠితులు 3. ప్ర

౧౨ ప్రతినిధి సభాసదులు తమ తమ స
లకు ప్రతినిధు లగుదురు. వారిని వారి సముదా
వర్షము ఎన్నుకొనును. ఏ సముదాయమైనను తన
తమయిష్టము వచ్చినపుడు మార్చగలదు.

(సూచన) సముదాయములను సభాసదులు
నేర్పరుతురు. లేక అంతరంగసభ తనయిష్టము వచ్చి
చును. కాని ఏసముదాయమునందు ౧౦ మంది క
ఆర్యసభాసదు లుండరాదు.

౧౩ పైచెప్పిన ప్రతినిధి సభాసదుల విశేషకార్యములు క్రింద జూపినవై యుండును.

(క) తన సముదాయసమ్మతిని తా నెరిగియుండుట.

(ఖ) తన సముదాయమునకు ప్రకాశింపదగిన అంతరంగసభాకార్యములను తెలుపుట

(గ) తన సముదాయమునుండి చందా వసూలుచేసి కోశాధ్యక్షున కొప్పించుట

౧౪ అంతరంగ సభకొరకై ప్రతిష్ఠిత సభాసదులు ఆర్యసభాసదులనుండి వార్షిక సాధారణసభలో నెన్నుకొనబడుదురు. ఇందు విశేషగుణములు కలవారే యెన్నుకొనబడుదురు. ప్రతిష్ఠిత సభాసదులు అంతరంగసభ్యులలో మూడవవంతుకంటె నెక్కువగా నుండరు.

౧౫ ప్రతిసంవత్సరమునను అంతరంగసభయొక్క ప్రతిష్ఠితసభాసదులు, అధికారులు, ఆయ వ్యయపట్టికల నిరీక్షకులు, వార్షికసాధారణసభలో మరల నియమింపబడుదురు. ఇందు పూర్వపు ప్రతిష్ఠితులు అధికారులు నుండవచ్చును. కాని యే అధికారియు సర్వసమ్మతిమైన గాని నిరంతరము మూడువర్షముల కంటె నధికముగా నొక పదవికి నెన్నుకొనబడ వీలులేదు.

౧౬ సంవత్సరము పూర్తికాక పూర్వము ప్రతిష్ఠిత సభాసదులలోగాని అధికారులలోగాని యెవరి స్థానమైన రిక్త

మగుచో నా కాళీస్థానమున మరియొక యోగ్యుని నియమించు నధికారము అంతరంగసభ కుండును.

౧౭ అంతరంగసభ కార్యనిర్వహణార్థ మేదైన ఉచిత వ్యవస్థ చేయగలుగును. కాని యా వ్యవస్థ ఆర్యసమాజ నియమోపనియమములకు విరుద్ధముగా నుండరాదు.

౧౮. అంతరంగసభ, యొకానొక విశేష కార్యనిర్వాహార్థము, తనలో కొంతమంది సభాసదులనుగాని, ఆర్య సభాసదులనుగాని విశేషగుణు లగు నార్యులనుగాని కలిపి యొక ఉపసభ నేర్పరుపగలదు.

౧౯. అంతరంగసభకు సంబంధించిన యేసభ్యుడైనను ఏదైన నొక విషయమును సభలో నివేదింపదలచిన నొక వారము రోజులు ముందుగానే మంత్రికి సూచింపజేయవలెను. మఱియు నా విషయ మధ్యక్షుల యనుమతి బడసినమీాదట సభలో వెల్లడింపదగును. కాని యేదైన నొక విషయమును అంతరంగసభ్యులలో నైదుగురు సభ్యులు కాని సభ్యులలో 3 వ వంతుగాని కోరినచో నది యనివార్యముగా నివేదింపబడును.

౨౦ ఒక మాసమున నొకమాటు అంతరంగసభ యవశ్యముగా జరుగవలయును. అధ్యక్షుల యాజ్ఞవలన నైదుగురు సభ్యులు గాని 3వ వంతు సభ్యులుగాని మంత్రికి వ్రాతమూలకముగా తెలిపినను సభ జరుగును.

అధికారులు:—

౨౧ అధికారు లారు విధములుగ నుందురు.

౧. అధ్యక్షుడు, ౨. ఉపాధ్యక్షుడు, ౩. మంత్రి, ౪. ఉపమంత్రి (సహాయకార్యదర్శి) ౫. కోశాధ్యక్షుడు, ౬. పుస్తకాధ్యక్షుడు

౨౨. ఉపాధ్యక్ష ఉపమంత్రి కోశాధ్యక్ష పుస్తకాధ్యక్ష పదవులలో నావశ్యకమైనపు డొకరికంటె నెక్కువ మంది నియుక్తు లగుటకు వీలుండును. ఇట్లేపదవిలోనైన నధిక వ్యక్తులు నియతు లయినపుడు వారి కార్యములను అంతరంగ సభ విభజించును.

అధ్యక్షుడు:—

౨౩. అధ్యక్షుని అధికారములు కర్తవ్యములు.

౧. అధ్యక్షుడు అంతరంగసభకును, తదితరసామాజిక సభ లన్నిటికి నధ్యక్షుడుగా నెంచబడును.

౨ ఎల్లపుడు సమాజమునకు సంబంధించిన నెల్లకార్యముల నుచితరీతిని జరుపనేర్పాట్లు చేయుచు సమాజముయొక్క యశౌన్నత్యరక్షణాదుల నధికతత్పరుడై యుండవలెను. సమాజకార్యము లన్నియు నియమానుసారముగా చేయబడుచున్నదియు లేనిదియు నిరీక్షించుచుండును. తానును నియమబద్ధుడై యుండును.

3 అవసరమని తోచినపు డేదైన నొక విషయములో వెంటనే యుచితవ్యవస్థ నొనరించును. ఇట్టి కార్య మేదైన చెడిన తానే యుత్తరదాత యగును.

౪ అధ్యక్షుడు తన యధ్యక్షత్వమును పురస్కరించుకొని యంతరంగసభచే నేర్పరుపబడు నుపసభ లన్నిటిలోను సభాసదు డగును.

౫ అధ్యక్షునకు సాధారణసమ్మతి (ఓటు) యేకాక నిర్ణాయకసమ్మతియు (కాస్టింగుఓటు) నొకటి యధికముగా నుండును.

ఉపాధ్యక్షుడు:—

౨౪ ఉపాధ్యక్షుడు అధ్యక్షుని యనుపస్థితిలో నతనికి ప్రతినిధిగా నుండును. సమాజకార్యము లన్నిటిలోను నధ్యక్షునకు సహాయకుడయి యుండుట అతనికి ముఖ్యకర్తవ్యము. ఒకరి కంటె నెక్కువ ఉపాధ్యక్షు లున్న నం దొకరు ఎన్నికసమయము ననే ముఖ్యోపాధ్యక్షులుగా నియమింపబడుదురు.

మంత్రి (కార్యదర్శి):—

౨౫ మంత్రి కర్తవ్యములు, అధికారములు.

(౧) అంతరంగసభయు, అధ్యక్షులయు నాజ్ఞను బొంది సమాజకార్యము లన్నియు నడుపును. సమాజ సంబంధమైన పత్రవ్యవహారము లన్నియు చేయును. అందు విశిష్టములు నావశ్యకములునయిన పత్రము లన్నియు జాగ్రత్తగా రక్షించును.

(౨) సమాజమున జరుగు సభల వృత్తాంతములను వ్రాసియుంచును. రెండవసభ జరుగుటకు పూర్వమే మొదట సభావృత్తాంతము వ్రాసిగాని, వ్రాయించిగాని యుంచవలయును.

(3) మాసిక అంతరంగసభలలో పూర్వ మాసిక సభానంతరము సమాజమున ప్రతిష్ఠులయినట్టియు సమాజమునుండి విడుదలయినట్టియు, నార్యులయు, నార్యసభాసదులయు నామములను వినిపించవలెను.

(౪) సమాజపు వైతనికవ్యక్తుల (భృత్యులు) కార్యముల సాధారణదృష్టితో నిరీక్షించును. సమాజనియమోపనియమములను, తదితరవ్యవస్థలను పాలించుటయందు ధ్యానముంచును.

(౫) సమాజమునకు సంబంధించిన సంస్థ లేవైన నున్న వాని యేర్పాట్లమీద సామాన్యదృష్టి నుంచును.

(౬) ప్రతి ఆర్యసభాసదుడు నేదో యొక సముదాయమున చేరియుండుటను, ప్రతి సముదాయమును తన ప్రతినిధి నంతరంగసభకు పంపుటను జాగ్రత్తగా చూడవలసియుండును.

(౭) ప్రతిసభకును నియమితకాలమునకు వచ్చి సమాప్తి వరకు కార్యతత్పరుడై ఉండవలెను.

ఉపమంత్రి (సహాయ కార్యదర్శి):—

౨౬ మంత్రి యనుపస్థితుడైన నతనికి ప్రతినిధియగును. సమాజకార్యము లన్నిటిలోను మంత్రికి సహాయకు డగును. ఇది ముఖ్యకార్యము.

కోశాధ్యక్షుడు:—

౨౭ కోశాధ్యక్షుని క_ర్తవ్యములు, అధికారములు.

(౧) సమాజమునకు సంబంధించిన సర్వాదాయమును తీసికొని రసీదు నివ్వవలెను. ఆ ద్రవ్యమును సురక్షితముగా నుంచవలెను. వ్రాతపూర్వకమైన యాజ్ఞను పొందక కొలది ద్రవ్యముకూడ నేరికి నీయరాదు. ఆజ్ఞను పొంది రసీదు తీసుకొని యివ్వవలెను.

(౨) అంతరంగసభయాజ్ఞ లేకుండ నెవరికి ద్రవ్యము నీయరాదు. అధ్యక్షునకు మంత్రికికూడ నంతరంగసభ యెంత ద్రవ్యము నీయవచ్చునని నియమించునో అంతకంటె నెక్కువ నీయరాదు. ఆ ధనముయొక్క సదుపయోగమును గురించి ఖర్చుపెట్టిన అధికారులే ఉ_త్తరదాత లగుదురు.

(౩) ద్రవ్యసంబంధమైన ఆయవ్యయములను తెలుపు "బహీంఖాతా" పు_స్తకములను సక్రమముగా నుంచవలెను. ప్రతిమాసమునను వానిని పరీక్షింపజేసి పు_స్తకసమేతముగా లెక్కను స్వీకారార్థము అంతరంగసభలో నుపస్థితము చేయ వలసి యుండును.

పు_స్తకాధ్యక్షుడు:—

౨౮ పు_స్తకాధ్యక్షుని క_ర్తవ్యములు

పు_స్తకాలయమున గల సమాజమునకు సంబంధించిన స్థిరపు_స్తకములను, విక్రయింపదగిన పు_స్తకములను రక్షించు

చుండవలెను. పుస్తకాలయమునకు సంబంధించిన లెక్కల పుస్తకములను సరిగా నుంచవలెను. పుస్తకములను పాఠకుల కిచ్చి పుచ్చుకొనుట, విక్రేయ పుస్తకములను తెప్పించుట, అమ్ముట, పుస్తకాలయమునకు సంబంధించిన జా మీా ను నుంచుట ఇ వన్నియు నితనికర్తవ్యములే.

సూచన:- స్థిరపుస్తకములుగాని, విక్రేయపుస్తకములు గాని, తెప్పించుటకు ముందుగా నంతరంగసభ నుండి సమ్మతిని తీసికొనియుండవలయును.

మిశ్రితము (ఇతర నియమములు):—

౨౯. ఆర్యసభాసదుల సమ్మతి పత్రము (ఓటు) ల ద్వారా తెప్పింపదగినపరిస్థితులు

౧. సమాజముయొక్క మేలుకొఱకు అంతరంగసభ ఆర్యసభాసదు లయిన నెల్లరి సమ్మతి (ఓటు) నెరుగకోరుట అవసరమని నిశ్చయించినపుడు—

౨. ఆర్యసభాసదులలో నైదవ వంతుగాని, ముగ్గురు కాని అనగా నిం దెవరి సంఖ్య యధికమయిన వారు కోరుచు దీనినిమిత్తమై మంత్రికి విజ్ఞప్తి పంపినపుడు—

3. అధిక వ్యయమునకు సంబంధించినట్టియు, కార్య క్రమమునకు సంబంధించినట్టియు, వ్యవస్థకు సంబంధించినట్టియు ముఖ్యప్రస్తావనను కావింపవలసినపుడు—

౩౦ ఏదైన నొక సభయందు స్వల్పకాల మొక యధికారి యనుపస్థితు డయ్యేనేని అతనిస్థానమున తాత్కాలిక ముగా యోగ్యవ్యక్తిని నియమించునధికారము అంతరంగసభ కుండును.

౩౧ వార్షిక సాధారణ సభలో నొక యధికారి స్థాన మున క్రొత్తపురుషుడు నియమింపబడకున్నచో మరల నియ మింపబడువరకు పూర్వాధికారియే ఎక్కువలో ఎక్కువ ఒక్క సంవత్సరమువరకు నాకార్యమును నిర్వహింపవచ్చును. కాని యత డాసంవత్సరమునకు ఆర్యసభాసదుడుగా నెన్నుకొనబడి యుండవలయును.

౩౨ అన్నివిధములయిన సభలయు, నుపసభలయు, వృత్తాంతము ఆర్యభాషలో దేవనాగరలిపితో వ్రాయబడును. ఆర్యసభాసదులలో నెవరేని దానిని జూడగోరుచో సభ్యుల యనుమతిమీద మంత్రి దానిని చూపగలడు.

సూచన:-ఆర్యావర్తనమునకు వెలుపలనుండు సమాజముల విషయములలో నీ నియమము అవశ్యకత ననుసరించి సవరింప వీలగును.

౩౩ సభాసదులలో మూడవవంతు చేరినపుడే సభ జరుగగలదు.

౩౪ సభలన్నిటిలోను ఉపసభలలోను బహుపక్షాను సారమే కార్యములు నిశ్చయింపబడును.

౩౫ ఆదాయములో పదియవవంతు స్థిరనిధిలో నుంచబడును.

౩౬ ఆర్యులు, ఆర్యసభాసదులు నందరు నార్యభాషను లేక సంస్కృతము నవశ్య మెరుంగవలెను.

౩౭ సామాజికు లందరు సాప్తాహిక సమావేశములలో సమ్మిలితు లగుచుండవలయును. ఇది ముఖ్యకర్తవ్యము.

౩౮ ఆర్యులు, ఆర్యసభాసదులు నెల్లరు తమ యానంద సమయములందును లాభప్రాప్తి సమయములందును సమాజమునకు యథోచితధనాదిసాహాయ్య మొనరింపవలెను.

౩౯ ఆపత్సమయములలో నెల్లరు పరస్పర సాహాయ్య మొనరించుకొనవలెను. ఆనందసమయములలో నిమంత్రణము పొంది యెల్లరు నందు పాల్గొనవలయును. పిన్నపెద్దల విచార ముండరాదు.

౪౦. ఒకానొక యార్యుడు కారణవశమున సంకటములో నున్న ఒకానొక విధవాస్త్రీగాని సంతానముగాని యనాథస్థితిలోనుండి జీవన నిర్వాహము కానట్లు నిశ్చయింపబడినపుడు అట్టివారిని రక్షించుట కార్యసమాజము యథోచిత ప్రబంధము నేర్పరుపవలయును.

౪౧. (క) ఆర్యులయు, ఆర్యసభాసదులయు పారస్పరిక సామాజిక కలహములను తీర్చుటకై ఆర్యసమాజపు వార్షిక సాధారణసభ యొక న్యాయోపసభను నియమించును.

(ఖ) ఆర్యసమాజమున నార్యులకుగాని ఆర్య సభా సదులకుగాని కలుగు కలవరములు సాధ్యమైనంతవరకు స్వయ ముగానే తీర్చుకొనుట మంచిది. పరస్పరము నిర్ణయము కాని పక్షమున వారు తమ తగవులను తమ సమాజమునకు సంబం ధించిన న్యాయోపసభలో నిర్ణయించుకొనవలయును.

(గ) సమాజ సంపత్తులను గురించిగాని అధికారము లను గురించిగాని తగవు లేర్పడిన నట్టి తగవులను నిర్ణయించు నధికారము న్యాయోపసభకే యుండును. అట్టి నిర్ణయము యొక్క అప్పీలు చేయదలచిన, ఆర్యప్రతినిధి సభవలన నియ మింపబడిన న్యాయసభలో చేయవచ్చును. ఆ సభయొక్క నిర్ణయ మంతిమనిర్ణయ మగును. ఒకానొక సమాజమున పూర్వము న్యాయోపసభ యేర్పడకున్నను తాత్కాలికముగా నేర్పడ వీలులేకున్నను ఆర్యప్రతినిధిసభచే నేర్పరుపబడిన న్యాయసభలో నిర్ణయము పొందవలయును. ఆ నిర్ణయము రెండుపక్షములవారికి మాననీయ మగును.

(ఘ) స్థానీయ ప్రాంతీయ న్యాయసభల నిర్ణయము నియమానుకూలముగా నున్నదని ప్రాంతీయ ప్రతినిధి సభాధ్య క్షుడు ఋజువుపరిచి నట్లయిన నేపక్షమునకును పై సభల నిర్ణయము నియమానుకూలము కాదనియో లేక ప్రమా దము జరిగినదనియో అప్పీలు జేయ వీలుండదు.

౪౨. నిమ్నలిఖిత పరిస్థితులలో నధికారుల స్థానములు రిక్తము (ఖాళీ) లైనట్లు ఎంచబడును.

(౧) అధికారి మరణించిన

(౨) పిచ్చివాడైన

(3) రాజీనామా నిచ్చిన పక్షమున

(౪) ఆర్యన్యాయోపసభవలనగాని, రాజకీయ న్యాయసభవలననేని యపరాధి యని నిర్ణయింపబడినవాడట్టి వ్యక్తి సభాసదుడుగా నుండదగడని అంతరంగసభ నిశ్చయించిన పక్షమున

౪3. అధ్యక్షుడొకానొక విశేషపరిస్థితిలో నంతరంగ సభ యనుమతి దీసికొని యే యధికారి నైనను స్థగితుని చేయగలడు. (అతని స్థానమునుండి నియత కాలము వరకు తొలగింపగలడు.) కాని యంతిమ నిర్ణయార్థము పదునైదు దినములలోపల నైమిత్తికసాధారణసభను సమావేశపరచవలసి యుండును.

౪౪. అధ్యక్షుని, స్వస్థానమునుండి భ్రష్టుని జేయు నధికార మితరుల కెవరికి నుండదు. సాధారణసభ అధ్యక్షునికి విరుద్ధముగా విశ్వాసరాహిత్య తీర్మాన మొనరించినట్లయిన త్యాగపత్ర మిచ్చి యా పదవినుండి తొలగవలసియుండును.

౪౫. ప్రత్యేకప్రాంతమునను "ఆర్యప్రతినిధిసభ" అను పేరుతో నొక ముఖ్యసభ యుండును. అన్ని సమాజములయు

వ్యవస్థ ప్రతినిధిసభ కధీనమై తదనుకూలముగా నుండును. ఈ సభ తన నియమములను తానే స్వయముగా నేర్పరుచుకొనును.

౪౯ ప్రాంతీయ ప్రతినిధిసభకు సంబంధించిన యాజ్ఞ యొక్క లేక వ్యవస్థవిషయమున, నేదేని యొక సమాజము నిరంతరము ఘోరముగా విరోధించు పక్షమున లేక స్థానీయ సామాజిక వ్యవస్థ ప్రతినిధిసభయొక్క దృష్టిలో సమాజమునకు హాని కలిగించునదిగా తోచినపక్షమున ప్రాంతీయ సభాధ్యక్షుడు తన అంతరంగ సభానుమతితో నా స్థానీయసమాజ సంఘటనమును (కూర్పు) నియతికాలమువరకు నరికట్టగలడు. ఆ సమాజమునకు సంబంధించిన సంస్థల ప్రబంధాది కార్యములనుచితరీతిని నడుపును.

౪౭ ఆర్య ప్రపంచమున కంతకు ముఖ్యతమ మగు సభ యొకటి యుండును. దానిపేరు 'సార్వదేశిక ఆర్యప్రతినిధి సభ' అగును. సమస్త ఆర్యప్రతినిధిసభల పురుషార్థము మేలవించి ఆర్యజగత్తును సరియైనవ్యవస్థలో నుంచుట దాని ముఖ్య కర్తవ్యము. ఈసభ తన నియమములను స్వయముగా నేర్పరచుకొనును.

౪౮ ఈ యుపనియమములు ఆవశ్యకత ననుసరించి సార్వదేశిక ఆర్యప్రతినిధిసభకు ఉచితవిజ్ఞాపన చేసినమీాదట సంస్కరించుటకును, పెంచుటకును, తగ్గించుటకును అధికారముండును.

ఓ౩మ్.

## ఆ ర్య స మా జ ము యొ క్క

## ప్రవేశ పత్రము

శ్రీ మంత్రిగారి సమ్ముఖమునకు

ఆర్యసమాజము....................................

శ్రీయుత మంత్రిగారూ!

'న మ స్తే'!

నేను ఆర్యసమాజముయొక్క ఉద్దేశములను, మంతవ్యములను, వేదాధారమున దయానందమహర్షి గ్రంథములలో వ్రాయబడిన ప్రకారముగా, సంతోషముతో నొప్పుకొనుచున్నాను. మరియు తదనుకూలాచరణమును గ్రహించుచున్నాను. నాపేరు నార్యసమాజమున జేర్చుకొనుడు.

నామము............................................................

తండ్రిపేరు..........................................వయస్సు......

సంపూర్ణ చిరునామ..................................................

..........................................................................

వృత్తి.....................................

మాసికచందా (ఆయమున శతాంశము ౧/౧౦౦).......

.......................................................

తిథి (తారీఖు)..........................

సంతకము..............................................................

స్వీకృతి తిథి.........................................

# విజ్ఞప్తి.

ఆర్యులారా!

ఆర్య సమాజశాఖలను ఆంధ్ర దేశమందెల్లెడల స్థాపింప గోరుచున్నాము. ఈ మాప్రయత్నమునకు తోడుపడ నందఱిని ప్రార్థించుచున్నాము.

వైదిక సాహిత్యమునకు సంబంధించిన పుస్తకములు, అనగా వేదముల అనువాదములు, నిరుక్తానువాదములు మున్నగునవి వ్యక్తులకును, సంస్థలకుకూడ తక్కువ వెలలకు విక్రయింపబడును.

వివరములు తెలియగోరువారు ఒక అణా పోస్టేజి బిళ్లతో ఈ క్రింది చిరునామాకు వ్రాయ ప్రార్థన.

ప్రేమమందిరము,

హనుమాన్‌పేట, బెజవాడ.

# ఆర్య సాహిత్యమండల్, లిమిటెడ్.

## ఉద్దేశములు.

వేదములు, వైదికసాహిత్యమును, మానవసభ్యతకు మానవ ధర్మమునకు నాదిమూలములు. ఆ వైదికసాహిత్యమును పునరుద్ధరించిన శ్రీమద్దయానందమహర్షి కృతగ్రంథముల నతి స్వల్పమూల్యముపై ప్రతిగృహమున కందజేయు సంస్థలలో ముఖ్యమైనది

ఆర్యసాహిత్య మండల్ లిమిటెడ్, అజమీర్.

ఈసంస్థ ప్రపథమమున నాలుగు వేదములు హిందీ అనువాద సహితముగా పదునాలుగు భాగములలో (ఒక్కొక్క భాగమున ౮౦౦ పేజీలుండును) నచ్చొత్తించి రు ౪౨-౦-౦ లలోనే జనుల కందజేయగలిగినది. ఇంతకుపూర్వ మీ వేదములు సంపూర్ణముగా హిందీ యనువాదముతో నెంత వెచ్చించినను దొరికెడివిగావు.

భాష్యకారుడు శ్రీపండిత జయదేవశర్మ, విద్యాలంకార మీమాంసాతీర్థ, స్నాతక్ గురుకుల్, గాంగడీ

ముద్రణ చాల సుందరమైనది. నునుపైన తెల్లని కాగితములు. ఈ గ్రంథము లిష్టమిత్రులకు సుందరమైన పవిత్రమైన ఉపహారములుగా నీయదగినవి. పుస్తకాలయము లందును

విద్వాంసుల గృహములందు నలంకారమును పెంపుచేయును. ధార్మిక శుభసంస్కార సమయములందు కానుకలుగా నర్పింప దగినవి.

## వే దా ను వా ద ము లు.

అనువాదము:— సాయణాచార్యుడు, మహీధరుడు, దయానందమహర్షి, పం. తులసీరామస్వామి, పం. జ్వాలాప్రసాద, వివరణకారుడయిన మాధవుడు మున్నగు వేదభాష్యకర్తల భాష్యముల నెదుట నుంచుకొని బ్రాహ్మణములు ఉపనిషత్తులు ఆరణ్యకములు, నిరుక్తము, వ్యాకరణాది ఆర్ష గ్రంథముల నాధారముగా గొని ప్రమాణముల జూపుచు ఆర్షవైదిక సిద్ధాంతముల కనుకూలముగా చేయబడినది.

| | | | | |
|---|---|---|---|---|
| ఋగ్వేదము | ౭ | భాగములు | రు | ౨౮—౦—౦ |
| యజుర్వేదము | ౨ | ,, | | ౮—౦—౦ |
| సామవేదము | ౧ | ,, | | ౪—౦—౦ |
| అథర్వవేదము | ౪ | ,, | | ౧౬—౦—౧ |
| | ౧౪ | | రు | ౫౬—౧=౦ |

నాలుగువేదములు సంపూర్ణముగా తెప్పించుకొను వారికి మార్గవ్యయసహితముగా (పోస్టేజీసహా) రు౪౨=౦—౦ల లోనే పదునాలుగుభాగములు పంపబడును.

విదేశీయులలోను ఆంగ్లభాషను నేర్చిన భారతీయుల లోను వేదముల విషయములలో ననేక భ్రమాత్మక విచార ములు వ్యాపించియుండుటను గుర్తించి యా భ్రమలను దూర మొనర్చుటకును ఆంగ్లభాషాను వాదములలో గల లోటు పాట్లను, అశ్లీలములు నసంబద్ధములయిన వ్రాతలను దొలగిం చుటకును ప్రస్తుత మీ సంస్థ వేదములను సంపూర్ణముగా నాంగ్లేయ భాషలో ననువదింపజేయ బూనుకొని యతివేగ ముతో కార్యక్రమము కొనసాగించుచున్నది.

లక్షలకొలది ద్రవ్యమును వెచ్చించియు సఫల మొంద రాని కార్యముల నీ సంస్థ దానము, చందా మున్నగు పద్ధతు లను గూడ నూత గొనక స్వతంత్రవృత్తితో చక్కగా నెరవేర్చు చున్నది. ప్రతి సనాతన ధర్మియు, వైదిక సభ్యత యందు శ్రద్ధాభక్తులు గల ప్రతి వ్యక్తియు నీ మండల కార్య ములందు పాల్గొని విశేషప్రచార మొనరించుట కర్తవ్యముగా నెంచవలయును.

## వెలువరించిన గ్రంథములు.

ఈ మండలాధిపత్యమున హిందీలో ప్రతివిషయము నందు ననేకోత్తమోత్తమ గ్రంథములు ప్రకాశింపజేయబడినవి. ప్రస్తుత మింకను వెలువడుచున్నవి.

ఈ సంస్థలో దొరకు ఆంగ్ల గ్రంథములు.

| | | |
|---|---|---|
| ౧. | వైదిక మిస్టిసిస్ | రు ౫- ౦-౦ |
| ౨. | వైదిక టీచింగ్సు అండ్ ఐడియల్స్ | రు ౧-౧౨-౦ |
| 3. | ఎంథోలజీ ఆఫ వైదిక హిమ్స్ | రు ౧-౧౨ ౦ |
| ౪. | హిందూ సుపీరియారిటీ | ౬- ౦-౦ |
| ౫. | స్వామీ దయానంద్ | ౧- ౦-౦ |

పై గ్రంథములేగాక క్రింది గ్రంథములుగూడ

## ప్రేమమందిర్, హనుమాన్ పేట, బెజవాడ

లో గూడ లభించగలవు.

| | | |
|---|---|---|
| ౧. | లైట్ ఆఫ్ ట్రూత్ | రు ౨-౦-౦ |
| ౨. | ఫౌంటెన్ హెడ్ ఆఫ్ రెలిజయన్స | ౧-౦-౦ |
| 3. | టెన్ ప్రిన్సిపుల్స్ ఆఫ్ ఆర్యసమాజ్ | ౦-౬-౦ |
| ౪. | త్రి లెక్చర్స్ ఆన్ ఆర్యన్ ఫిలాసఫీ | ౦-౬-౦ |
| ౫. | వాయిస్ ఆఫ్ ఆర్యావర్త | ౦-3-౦ |
| ౬. | టార్చి బేరర్ (పండిత వాస్వాని) | ౧-౦-౦ |
| ౭. | గ్లింప్సెస్ ఆఫ్ దయానంద | ౧-౦-౦ |
| ౮. | ఎక్లీజియా డివినా | ౫-౦-౦ |
| ౯. | అగ్నిహోత్ర | ౨-౮-౦ |
| ౧౦. | సత్యార్థ ప్రకాశము (తెలుగు) | ౧-౮-౦ |

# షేర్లు

ఈ మండలికి సహాయము చేయదగు నవకాశము.

(౧) ఈ మండలి రెండు లక్షలవరకు 'షేర్ల'ను పూర్తి చేయ నిశ్చయించినది. నేటివరకు ౧౧ వేలకు 'షేర్లు' (భాగములు) అమ్మబడినవి. మిగిలిన భాగములుకూడ త్వరగా పూర్తి గానున్నవి. ప్రతిభాగము వెల (ఒక్కొక్క 'షేరు') రు ౧౦-౦-౦ లు మాత్రమే. దరిద్రులుకూడ కొన వీలగునట్లు తగ్గువెల ఉంచబడినది. ఈ పదిరూపాయలు కూడ తడవకు రెండు రూపాయల చొప్పున నైదు పర్యాయములుగా చెల్లింపవచ్చును.

ఈ మండలిలో భాగస్వాము లగుటవలన ('షేరు' కొనుటవల్ల) ఈ క్రింది లాభములు కలుగును.

(క) భాగస్వాములకు నియమముగా ప్రతివర్షమునను నూటికి రు ౬—౪—౦ ల చొప్పున లాభము పంచుచున్నది. ఈ లాభము బ్యాంకువల్ల వచ్చు వడ్డీకంటె ఎక్కువేయనుట నిస్సంశయము.

(ఖ) ఇందు వేయబడుధనము స్థిరముగా నుండును, సురక్షితమునగును. ఇందు "షేర్లు" కొనుట స్థిరాస్తిని సంపాదించుటే అగును.

(౫) ఇందు ఉపయోగింపబడు ద్రవ్యము భారతీయ ఆర్య సంస్కృతిని వైదిక ధర్మమును పునరుద్ధరింప సహాయక మగును. ఇంతియకాక వైదికసాహిత్యము నానావిధ భాష లలో ప్రకాశింప జేయ దోడుపడును.

(౬) మండలికి మీరు స్థిరగ్రాహకులై (శాశ్వతచందా దారులు) అందు ప్రకాశింపబడు గ్రంథములను కొని మండలి ద్వారా నడుపబడు శుభకార్యములందు పాల్గొనవచ్చును. స్వయముగా మీ మీ స్వంత గ్రంథాలయములందు స్వల్ప మూల్యమునకే సుందరగ్రంథముల నుంచగలుగుదురు. గ్రాహకు లధికులయిన కొలది గ్రంథములు అతి స్వల్పమూల్యమునకే లభించును.

(౭) మండలి తనగ్రాహకులకు తన గ్రంథములను భాగ స్వాములకు (పేర్లుకొన్నవారికి) 3/౪ మూల్యమున కిచ్చును.

(౮) భారతజాగృతికి దయానందమహర్షి చే రచింపబడిన గ్రంథముల నన్నిటిని ప్రకాశించుటకైన ఖర్చుల మూల్యమునకే ప్రచారార్థ మొసంగును.

(౯) విశ్వాసపాత్రులయిన మహానుభావులకు పుస్తకా లయములకు గ్రంథములను ముందుగా నిచ్చి నెలకింతయని వాయిదాలమీద వాని మూల్యమును తీసికొనును.

(౧౦) వైదిక ధర్మమునకు సంబంధించిన దర్శనములు ఇతిహాసములు, ఆయుర్వేదాది శాఖాగ్రంథములు అన్వేషించి

అల్పమూల్యమునకు లభించునట్లు వానిని ప్రకాశింపజేయును. వేదము లన్నియు సరలమై విద్వత్తాపూర్ణమైన భాషలో నను వదించి వైదిక ధర్మప్రచార మొనర్చుచున్నది.

(ఙ) పురుషార్థులును వైదిక ధర్మానుయాయులు నగు సజ్జనులకు అనువాదాది కార్యముల నిచ్చుటకు నీ మండలి సిద్ధముగా నుండును.

(3) భద్రపురుషులారా! మీరు యథాశక్తి నీ మండలికి తగు సాహాయ్య మొనర్చి ఉత్తమోత్తమ మగు వైదిక సాహిత్యమును హిందీ మున్నగు భాషలలో ననువదింపజేసి ధర్మప్రచార మొనర్చుచు దేశదేశములందు కీర్తిని వెదజల్లుడు. మీ నామములను ప్రపంచమున సుస్థిర మొనర్చుడు. అన్య ధర్మావలంబులు ప్రతివారును తమ ధర్మగ్రంథములను ప్రకాశింపజేయుటకు లక్షలకొలది ధనమును వెచ్చించుచున్నారు. భారతీయులు నిట్టి యుత్తమ కార్యమునకై వెనుదీయరని భావించుచున్నాడ.

భవదీయ
మథురా: ప్రసాద్ శివహరే
ఆర్య సాహిత్య మండల్ లిమిటెడ్.,
అజ్మీర్ (రాజపుతానా)

# విషయసూచిక.







# తప్పొప్పుల పట్టిక.



| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| ౧౪ | ౧౩ | స్వమ్యంతవ్యా | స్వమంతవ్యా |
| ౬౩ | ౫ | మద్ధిమంతు | బుద్ధిమంతు |